# చందమామ

ఈ సంచికలో కథలు, వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.



వర్ణింప నశక్యమైన రావల్ గావ్ మిఠాయిలు.
అనే కవిధములయిన రుచికరపు సువాసనలు—
నారింజ, నిమ్మ, చాకలెట్, పిప్పరమెంట్.
ఏసమయ మందైనా ఏస్థలమందైనా. వీటిసంతోష.
సుఖములను అనుభ వించండి.

# రావల్‌గావ్

మిఠాయిలు. టాఫీలు శేకో బోన్ బోన్
మరియు పెశల్ కేండీ.

## రావల్ గావ్ నాప్రియమైన మిఠాయిలు.

సోల్ సెల్లింగ్ ఏజంట్లు:

మెసర్స్. మోతిలాల్ గిరిధారిలాల్ అఘార్కర్, మాలేగావ్, నాశిక్ జిల్లా. గ్రేటర్ బొంబాయి, ఢిల్లీ, పంజాబ్, జమ్ము & కాశ్మీర్ ఏజెంట్లు: మెసర్స్. జె. చిత్తరంజన్ అండ్ కో., 3-బి, మంగళదాస్ రోడ్, బొంబాయి-2. ఫోన్: 311236 ★ 864, డాక్టర్. జోషి రోడ్, కరోల్ బాగ్ న్యూఢిల్లీ-5. ఫోన్: 564237 ★ ఉత్తర ప్రదేశ్ సబ్-ఏజెంట్లు: మెసర్స్. పరమానంద్ అండ్ కో., 110/77, ఆర్. కె. నగర్, కాన్పూర్.

# క్రమ శిక్షణే దేశానికి బలం.

జన బాహుళ్యంలో క్రమశిక్షణ పెంపొందితేనే ఆ దేశ ప్రజలు గొప్ప జాతిగా రూపొంద గలుగుతారు.



మహాత్మా గాంధీ.



**MAHATMA GANDHI**
BIRTH CENTENARY
OCT. 2, 1968 TO
FEB. 22, 1970

**महात्मा गांधी**
जन्म शताब्दी
अक्तूबर 2,1968 से
फरवरी 22,1970

davp 68/799



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచికతో "కృష్ణావతారం", "అరణ్యపురాణం" పూర్తి అవుతున్నాయి. పై నెల నుంచి "మహాభారతం" రంగుల బొమ్మల సీరియల్‌గా ప్రారంభమవుతుంది. లోగడ భారతంలోని కొన్ని ఘట్టాలు "చందమామ"లో ప్రచురించాము. కాని మహాభారత కథ సమగ్రంగా, రంగుల బొమ్మలతో ప్రచురించటం ఇదే మొదటిసారి. మహాభారత కథను సేకరించదలచినవారు ప్రారంభం నుంచీ సంచికలు చేర్చి జాగ్రత్త పడటం మంచిది.

సంపుటి 44 ఫిబ్రవరి '69 సంచిక 2



# దయాకరుడు

రాజశేఖరపురంలో రత్నాకరుడనే వర్తకుడు ఉండేవాడు. ఆయన దేశాంతరాలలో ఓడ వర్తకం చేసి కోట్ల కొద్దీ ఆర్జించాడు. ఎంత డబ్బున్నా ఆయనకు దాన ధర్మాలు చేసే అలవాటు లేదు.

రత్నాకరుడి భార్య గుణవతిది మటుకు జాలిగుండె. కొద్ది డబ్బు కూడా లేని కారణంచేత దారుణంగా బాధపడే వాళ్ళను చూస్తే ఆమె హృదయం ద్రవించి పోయేది. కాని భర్త ఒప్పుకోడని, ఎవరికీ ఎలాటి సహాయమూ చేయలేక, వారి బాధలు చూసి తానే బాధ పడేది.

వారిద్దరి సంతానం దయాకరుడు. అతను తల్లిలాగే దయాగుణం కలవాడు, తండ్రిలాగా తెలివితేటలు గలవాడు. అతనికి యుక్త వయసు రాగానే తగిన కన్యను చూసి పెళ్ళి చేద్దామని తల్లి ఆలోచించింది. కాని రత్నాకరుడు అందుకు ఒప్పుకోలేదు.

"వాడికి ధనం సంపాదించే శక్తి ఉన్నట్టు రుజువైనదాకా పెళ్ళి వీలులేదు. ఇప్పుడే పెళ్ళి చేస్తే విలాసాలు మరుగుతాడు. ఆ తరవాత వాడికి వర్తకంలో బుద్ధి ప్రవేశిస్తుందా?" అన్నాడు రత్నాకరుడు.

ఆయన దయాకరుడికి ఒక ఓడ ఇచ్చి, దాన్నిండా సరుకులు నింపి, వర్తకం చేసుకు రమ్మని ఇంటి నుంచి పంపాడు. దయాకరుడు తన సిబ్బందితో సహా సముద్రం దాటి, ఒక రేవు చేరి, అక్కడ గుడారం వేసి కూర్చున్నాడు. అక్కడి వర్తకులు అతనితో వ్యాపారం గురించి మాట్లాడటానికి వచ్చారు. అదే సమయంలో రక్షకభటులు అనేకమంది ఖైదీలను అటుగా తీసుకుపోతూండటం దయాకరుడు చూశాడు. ఖైదీల చేతులకు బేడీలూ, గొలుసులూ ఉన్నాయి. ఖైదీలు నడి ఎండలో చెమటలు దిగగారుతూ, నడుస్తున్నారు.

దొడ్డంరెడ్డి వెంకటసుబ్బారెడ్డి

దయాకరుడు వర్తకులతో, "ఈ ఖైదీ లందరూ ఎవరు? దొంగలే?" అన్నాడు.

"వాళ్ళంతా పేద రైతులు. రాజుగారికి పన్నులు చెల్లించలేక పోయారు. అంతా కలిసి ఆరువందల మంది," అన్నారు వర్తకులు.

వాళ్ళ స్థితి తలుచుకుంటే దయాకరుడి గుండె నీరయింది. అతను తన సరుకుల నన్నిటినీ అక్కడి వర్తకులకు అమ్మేసి, సొమ్ము చేసుకుని, రాజుగారి వద్దకు పోయి, రైతులు బాకీపడిన మొత్తమంతా తానే ఇచ్చి, ఖైదు నుంచి ఆ ఆరువందల మంది రైతులనూ విడిపించి, మిగిలిన డబ్బుతో ఇంటికి చేరుకున్నాడు.

అతను తెచ్చిన డబ్బు చూసి, "సరుకంతా అమ్మగా ఇంతేనా వచ్చింది? పెట్టుబడిలో పదోవంతు కూడా తిరిగి రాలేదే—లాభం మాట దేవుడెరుగును!" అన్నాడు రత్నాకరుడు.

దయాకరుడు తాను ఖైదీలను విడిపించటం గురించి తండ్రికి చెప్పాడు.

"ఛీ, దరిద్రుడా! నీ మొహం నాకు చూపకు! నా ఇంటి నుంచి తక్షణం వెళ్ళిపో!" అని రత్నాకరుడు దయాకరుడి పైన రంకెలు పెట్టాడు.




గుణవతి ఏడుస్తూ భర్తను బతిమాలుకున్నది; కొడుకు చేసిన ఈ ఒక్క తప్పూ క్షమించమన్నది. రత్నాకరుడు కాస్త మెత్తబడి, దయాకరుడికి మరొక ఓడ నిండా సరుకులిచ్చి, మళ్ళీ పంపాడు.

ఈసారి దయాకరుడి ప్రయాణానికి ఆరంభంలోనే అవాంతరం వచ్చింది. దయాకరుడి ఓడ ఉన్న రేవులోనే మరొక ఓడ ఉన్నది. అందులోకి అనేకమంది స్త్రీలనూ, పురుషులనూ ఎక్కిస్తున్నారు.

దయాకరుడు ఆ ఓడ వాళ్ళతో మాట్లాడి, ఆ ఏడ్చే వాళ్ళందరూ బానిసలనీ, వాళ్ళను ఇతర దేశాలలో అమ్మి ఓడ యజ




మానులు లాభాలు పొందుతారనీ తెలుసుకున్నాడు. అతనికి ఆశ్చర్యమూ, జాలీ కలిగాయి. అతను బానిస వర్తకుల వద్దకు వెళ్ళి, "నా ఓడలోని సరుకంతా తీసుకుని మీ బానిస లందరినీ విడిచెయ్యండి," అన్నాడు. అతని ఓడలోని సరుకంతా పరీక్షించి బానిస వర్తకులు అతను చెప్పిన దానికి ఒప్పుకున్నారు.

విడుదల అయిన బానిసలు ఎక్కడెక్కడి వాళ్ళో కనుక్కొని, అందరినీ వాళ్ళ వాళ్ళ ప్రాంతాలకు దయాకరుడు పంపేశాడు. బానిసలలో ఇద్దరు స్త్రీలు మాత్రం మిగిలారు. ఒకామె పడుచుపిల్ల, రెండవది ముసలిది.

"మీరెవరు? మీది ఏ ప్రాంతం?" అని దయాకరుడు అడిగాడు.

పడుచుపిల్ల తలవంచుకుని జవాబు చెప్పలేదు. ముసలిది మాత్రం, "నే నీమె దాసీని," అన్నది.

"ఈమె ఎవరు?" అని దయాకరుడు అడిగిన దానికి ముసలిది ఏమీ చెప్పలేదు.

"మిమ్మల్ని ఎక్కడికి పంపమన్నారు?" అని దయాకరుడు అడిగాడు.

"మాకు ఎక్కడికీ పోవటానికి లేదు," అన్నది ముసలిది.

చేసేదిలేక దయాకరుడు ఆ స్త్రీల నిద్దరినీ తన ఇంటికే తీసుకుపోయి, తండ్రితో జరిగిన దంతా చెప్పేశాడు.

తన కొడుకు ఎందుకూ పనికి రాడని రత్నాకరుడు రూఢి చేసుకున్నాడు. వర్తకం చెయ్యటమూ కాదు, అందులో నష్టపోవటమూ కాదు, తన కొడుకు ఎవరో బానిసపిల్ల అందం చూసి భ్రమలోపడి, ఓడలోని సరుకునంతా ఎవరికో కట్టబెట్టి, ఇంటికి తిరిగి వచ్చాడని ఆయన అపోహ పడ్డాడు. తన కొడుక్కు పెళ్ళి చేసినా ఇదే జరిగి ఉండేదని ఆయనకు నిదర్శనం కనపడ్డట్టయింది. ఆయన ఈసారి సంకోచం ఏమీ లేకుండా తన కొడుకును ఇంటి నుంచి

బయటికి పంపేశాడు. ఈసారి గుణవతి కూడా భర్తను తప్పుపట్టలేకపోయింది.

ఇల్లు విడిచి వచ్చిన దయాకరుడికి స్నేహితులు సహాయపడి, అతనికి కొంత పెట్టుబడి ఇచ్చి, ఉండటానికొక చిన్న ఇల్లు కూడా ఏర్పాటు చేశారు. తన వెంట ఉన్న ఇద్దరు స్త్రీలతో తాను ఆ ఇంట ఉంటూ, దయాకరుడు స్నేహితుల సహాయంతో చిన్న వ్యాపారాలు సాగించాడు. ఈ వ్యాపారాలలో అతనికి బాగా కలిసి వచ్చింది. ఏడాది తిరగకముందే అతను తన స్నేహితులకు వారి డబ్బు తిరిగి ఇచ్చేశాడు. వ్యాపారంలో తనకు మిగిలే లాభంలో కొంత దానధర్మాలకు కేటాయించి, మిగిలిన దానితో పొదుపుగా బతుకుతూ వచ్చాడు.



దయాకరుడి వెంట ఉన్న ఇద్దరు స్త్రీలలోనూ చిన్నది విజయపుర రాజకుమార్తె. ఆమె వెంట ఉన్న ముసలిది ఆమె దాది. వారిద్దరినీ దొంగలు ఎత్తుకుపోయి బానిస వర్తకులకు అమ్మారు. తాను ఫలానా దేశపు రాజకుమార్తెనని చెప్పుకోవటానికి ఆమె సిగ్గు పడింది. తాను బానిసగా అమ్ముడు కావటం తన తండ్రికి అవమానమనీ, ఆయన వంశానికి తీరని కళంకమనీ ఆమె అనుకున్నది. దయాకరుడు తనను మిగిలిన బానిసలతోబాటు బానిసగా కొన్నాడనే ఆమె మొదట అనుకున్నది. కాని రాను రాను అతనంటే ఆమెకు చాలా గౌరవం ఏర్పడింది. ఆ కారణంచేత, బతికి ఉన్నంత కాలమూ అతని అండనే ఉండి, అజ్ఞాత వాసం చేద్దామని ఆమె నిశ్చయించింది.

అయితే ఈలోపల విజయపురి రాజు చేతులు కట్టుకు కూర్చోలేదు. తన కుమార్తె కనిపించకుండా పోయిన నాటినుంచీ ఆయన తన చారులను దేశదేశాలకూ పంపి, ఆమె కోసం వెతికిస్తున్నాడు. అలా వెతుకుతున్న వారిలో కొందరు రాజశేఖరపురం చేరారు. ఆ ఊళ్ళో ఉండే రత్నాకరు డనే కోటీశ్వరుడి

కొడుకు దయాకరు డనేవాడు, అనేకవందల మంది బానిసలను విడిపించాడనీ, అందులో ఇద్దరు స్త్రీలు ఇంకా అతని వెంటనే ఉన్నా రనీ వాళ్ళకు తెలియ వచ్చింది. వారు దయాకరుడి ఇంటికి వెళ్ళి, అక్కడ ఉన్న తమ రాజకుమార్తెనూ, దాదినీ గుర్తించారు.

రాజకుమార్తె వారి వెంట తన తండ్రి ఇంటికి వెళ్ళ నిరాకరించింది. "ఇక్కడ మాకు సుఖంగానే జరుగుతున్నది. ఎప్పటి కైనా నేను పరాయి చోటికి వెళ్ళేదాన్నే కదా! మా నాన్నగారికి నా మూలంగా అప ఖ్యాతి కూడా దేనికి? నేను సుఖంగానే ఉన్నానని ఆయనకు చెప్పండి," అన్నదామె తన తండ్రి పంపిన వారితో.

ఈ వార్త చేరగానే విజయపురి రాజు అట్టహాసంగా బయలుదేరి వచ్చాడు. తన కుమార్తెతో మాట్లాడాడు; తరవాత దయా కరుడితో, "ఈమె నా కుమార్తె. నేను తీసుకు పోతాను," అన్నాడు.

"చాలా సంతోషం! నేను ఏడాది కిందటనే పంపించి ఉందును. కాని ఆమె నాతో తన విషయా లేమీ చెప్పలేదు. పాపం, రాజభోగాలు అనుభవించవలిసిన మనిషి, నా పేద ఇంట ఇంతకాలం తలదాచు కున్నదంటే నాకు చాలా బాధగా ఉన్నది," అన్నాడు దయాకరుడు.

"కాని నా కూతురు నా వెంట రానంటున్నది. నీ కభ్యంతరం లేకపోతే ఆమెను నీ కిచ్చి చేస్తాను," అన్నాడు విజయపురి రాజు. దయాకరుడు తెల్లబోయి, ఏమీ అనలేకపోయాడు.

రాజు గట్టిగా నవ్వి, "పిచ్చివాడా, నిన్నామె ప్రేమిస్తున్నది. ఆ సంగతి కూడా తెలుసుకో లేదా?" అన్నాడు. ఆయనే తండ్రి కొడుకు లకు రాజీ చేసి, తన కుమార్తె వివాహాన్ని రాజశేఖరపురంలోనే మహా వైభవంగా జరిపించి, కూతురికీ, అల్లుడికీ అంతులేని కానుకలిచ్చి తిరిగి వెళ్ళిపోయాడు.





# గొర్రెదాటు

మందరగిరి రాజైన మందవర్మకు ఒక నమ్మకం ఉండేది. తాను ఎంతో సమర్థతతో పరిపాలించటంవల్ల ప్రజలు విజ్ఞానవంతులై, విచక్షణాజ్ఞానం కలిగి ఉండటం మూలంగా ప్రజాజీవితం శాంతి సౌఖ్యాలతో తులతూగుతున్నదని మందవర్మ తరుచు అనేవాడు.

ఈ మాట వినీ వినీ విసుగెత్తి మంత్రి, "మహారాజా, ప్రజలలో విజ్ఞానమూ, విచక్షణా జ్ఞానమూ ఉండటంచేత దేశంలో శాంతి సౌఖ్యాలు నెలకొన లేదు. రాజ్యానికి పెద్దలంగా ఉన్న మన ప్రవర్తన సరిగా ఉన్నంత కాలమూ ప్రజలు మనని అనుకరించి సక్రమంగా నడుస్తారు. మనం తప్పుతోవన పోయిననాడు వాళ్ళూ తప్పుతోవన పోతారు. అంతా గొర్రెదాటు," అన్నాడు.

ప్రజలది గొర్రెదాటు అన్నందుకూ, తన మాటను తోసి పుచ్చినందుకూ కూడా రాజుకు మంత్రి పైన ఆగ్రహం వచ్చింది.

"ప్రజలది గొర్రెదాటు మనస్తత్వం అని రుజువు చెయ్యి. నీకు ఆరు మాసాలు గడువిస్తాను. గడువు లోపుగా రుజువు చెయ్యకపోతే నీ తల తీయిస్తాను," అన్నాడు రాజు.

మంత్రి రాజభవనం నుంచి తిన్నగా చెరసాలకు వెళ్ళి, మర్నాడే విడుదల కాబోతున్న ఖైదీ ఎవడో తెలుసుకుని, వాడితో ఏకాంతంగా మాట్లాడి ఇంటికి వెళ్ళిపోయాడు.

పది సంవత్సరాలు కారాగృహంలో గడిపిన ఆ ఖైదీ, మర్నాడు తెల్లవారుఝామున విడుదల అవుతూనే సన్యాసి వేషం వేసుకుని రాచనగరుకు కొంత దూరాన ఒక చెట్టు కింద కళ్ళు మూసుకుని, పద్మాసనం వేసుకుని కూర్చున్నాడు.

కొంచెం పొద్దెక్కేదాకా ఆగి మంత్రి నగర పర్యవేక్షణ చేసే వంక పెట్టుకుని అటుగా కొద్దిమంది భటులతో వచ్చి, సన్యాసికి పాదాభివందనం చేశాడు.

కె. కె. రావు

దారిన పొయ్యే జనం ఇదంతా చూసి సన్యాసికి దణ్ణాలు పెట్టుకుని, తోచిన కాను కలు కూడా అర్పించి తమ దారిన పోతూ, "మంత్రిగారే ఆయన పాదాలు పట్టుకున్నా రంటే మహాత్ముడే అయి ఉండాలి," అని చెప్పుకోసాగారు.

సన్యాసి వార్త, మంత్రిగారి భక్తి నగరం లోకి పాకాయి. నగరంలో నుంచి ప్రజలు చిన్న చిన్న గుంపులుగా సన్యాసిని చూడ డానికి రాసాగారు. ప్రజల మొక్కుబళ్ళు జాస్తిఅయాయి. రాజభవనం నుంచి కూడా నౌకర్లు వీలు చూసుకుని సన్యాసి దర్శ నార్థం బయలుదేరారు.

సంగతి రాజుగారి దాకా వెళ్లింది. రాజు మంత్రితో, "విన్నావా? మన నగరాని కెవరో మహాత్ముడు వచ్చాడట!" అన్నాడు.

"చిత్తం, నేను వారి దర్శనం కూడా చేసుకున్నాను. వారి ముఖాన బ్రహ్మతేజస్సు తాండవిస్తూ ఉంది," అన్నాడు మంత్రి.

"అయితే మనం కూడా వారి దర్శనం ఒకసారి చేస్తాం," అని రాజు బ్రహ్మాండ మైన పరివారాన్ని వెంటబెట్టుకుని వెళ్ళి, చెట్టు కింది సన్యాసిని దర్శించి, నమస్క రించి వచ్చాడు.

దాంతో సన్యాసిని చూసేవాళ్ళు తండోప తండాలయారు. దేశం అన్నిమూలల నుంచీ జనం తీర్థయాత్రగా రాసాగారు. సన్యాసి చుట్టూ కొందరు బ్రాహ్మణభక్తులు చేరి, చూడవచ్చే భక్తులను శాసిస్తున్నారు.

ఒకవారం గడవనిచ్చి మంత్రి రాజుతో రహస్యంగా, "మహారాజా, గొప్ప పొరపాటు జరిగిపోయింది. చెట్టు కింద సన్యాసి ఎటో పారిపోయాడు. నేను విచారించగా, వాడు మన కారాగృహంలో పదేళ్ళు శిక్ష అనుభ వించినట్టు తెలిసింది," అన్నాడు.

ఆ తరవాత రాజు, మంత్రి చెప్పిన "గొరెదాటు" మనస్తత్వం గురించి ప్రస్తా వించనేలేదు.






## 14

[పులిబోను దగ్గిర కాపలావేసి శిఖిముఖి, చెంచుదయ్యాలపోతును పట్టుకున్నాడు. యీ లోపల నాగుమల్లిని చెంచువాళ్ళు ఆకాశగుహకు తీసుకుపోయారు. దయ్యాలపోతు ప్రాణభయం కొద్దీ శిఖిముఖికి ఆకాశగుహ దగ్గిర సాయపడతానని మాటయిచ్చాడు. బోనులో పడిన పులిని తాళ్ళసాయంతో శబరులు యీడ్చుకు పోసాగారు. తరవాత—]

శిఖిముఖీ, విక్రమకేసరుల వెనకగా నడుస్తున్న శబరులూ, సవరలూ పులిబోను దగ్గిరకు రాగానే, దాని చుట్టూ మూగారు. వాళ్ళల్లో ఒకరిద్దరు ఈటెలతో దాన్ని బెదర కొట్టబోయేసరికి, పులి రెచ్చిపోయి పంజాలు బయిటికి చాచి పెద్దగా గాండ్రించసాగింది. శిఖిముఖి వాళ్ళను వారించి పులిని ఓ సారి పరీక్షగా చూసి, తన భుజం మీద వున్న పులిచర్మాన్ని దాని కేసి వూపాడు. వెంటనే పులి బోనుమూలకు వెళ్ళి గుర్రుపెట్టుతూ వెనక కాళ్ళ మీద కూర్చున్నది.

" పులినే భయపెట్టే యీ పులిచర్మంతో మనం చాలా చాలా ఘనకార్యాలు చెయ్యొచ్చు. నా అనుమానం చెంచు దయ్యాలపోతు దీన్నేదో మంత్రించాడని," అన్నాడు శిఖిముఖి పెద్దగా నవ్వుతూ.

విక్రమకేసరి, శిఖిముఖి చేతిలో వున్న కపాలాన్నీ, పులిచర్మాన్నీ ఓ మారు తాకి



చూసి, ముఖంలో లేని బాధ కనబరుస్తూ, "వీటిని అంటుకుంటే నిప్పును అంటుకున్నట్టుగా చెయ్యి చుర్రుమన్నది. ఈ దయ్యాలపోతూ, శిథిలాలయ పూజారంత గొప్ప మంత్రవేత్తలా వున్నాడు," అన్నాడు. అతడి మాటలకు అనుచరులందరూ పొట్టలు చెక్కలయ్యేలా నవ్వారు.

తరవాత అందరూ అరణ్యమార్గాన కొంతదూరం పోయి, లోయలో నుంచి వున్న కాలిబాటల వెంట కొండ పైనున్న గుహ ప్రాంతానికి నడవసాగారు. పులిబోనును మిట్ట పైకి ఎక్కించటం శిఖిముఖి అనుచరులకు కొంత శ్రమగానే వున్నది. కాని,



ఆ పులి ద్వారా తమ కులపెద్ద కొడుకు ఏదో సాహసకార్యం చేయబోతున్నాడని వూహించి వాళ్ళు ఉత్సాహంగా బోనును పైకి లాక్కుపోసాగారు. పులి చాలాసేపు గాండ్రించి, ఓపిక పోయి కొంతా, పరిసరాలకు అలవాటు పడి కొంతా — శాంతించి బోనులో ఒక మూల నక్కి కూర్చున్నది.

ఆకాశగుహ ప్రాంతం చేరగానే శిఖిముఖీ, విక్రమకేసరులు తమ అనుచరుల్ని రెండు ముఠాలుగా విభజించారు. ఒక ముఠా వాళ్ళు తాము కొండ ఎక్కి వచ్చిన మార్గం నుంచి చెంచులు లోయలోకి పారిపోకుండా కాపలాకాయాలి. రెండవ ముఠా వాళ్ళు చెంచు గూడెం చుట్టూ వున్న కంచె దగ్గర వుండి, పరిస్థితుల్నిబట్టి లోపలికి దూకటమో లేక అక్కడే వుండి, బయటికి వచ్చే చెంచుల్ని బెదరకొట్టటమో చేయాలి. నాగుమల్లి తమ వశం అయేవరకూ, చెంచుల్తో ముఖాముఖి పోరు లేకుండా చూడాలని శిఖిముఖి అందర్నీ హెచ్చరించాడు. పులిబోను కంచె దగ్గిరగా వుంచబడింది.

చెంచు గూడెంలో అంతా కలిసి నలభైయాభై గుడిసెల కంటె ఎక్కువ వుండవు. వాటి చుట్టూ అయిదారడుగుల కంచె—బల





మైన కర్రలతో కట్టినది వున్నది. కంచె అవతల అక్కడక్కడా ఎత్తుగా పెరిగిన కొన్ని చెట్లున్నవి. వాటి కొమ్మలు కంచె మీదుగా వాలి, గూడెంలోకి దిగేందుకు అనువుగా వున్నవి. శిఖిముఖి, విక్రమకేసరీ అలాంటి చెట్టు నొకదాన్ని ఎక్కి, కొమ్మ మీద కూర్చుని గూడెంలో రేగే కోలాహలానికి కారణం ఏమిటా అని చూడసాగారు.

బడేచెంచు నివశించేది, మామూలు గుడిశెలాంటిది కాదు. ఒక పెద్ద కొండ గుహను అతడూ, అతడి కుటుంబం ఇల్లుగా వాడుకుంటారు. ఆ గుహ పక్కలనా, పైనా సున్నం పులిమి వాటి మీద రంగులతో రకరకాల బొమ్మలూ అవీ చిత్రించారు. ఆ గుహ ముందున్న ఖాళీ జాగాలో పెద్ద పెద్ద నెగళ్ళు మండుతున్నవి. వాటి చుట్టూ చెంచు స్త్రీలూ, పురుషులూ చేరి పాడుతూ, నాట్యాలు చేస్తున్నారు. ఒక ఎత్తయిన కొయ్యదుంగ మీద కూర్చుని శిధిలాలయ పూజారి యిదంతా చూస్తున్నాడు. బడేచెంచు కొంచెం దూరంలో నిలబడి దయ్యాలపోతుతో ఏదో మాట్లాడుతున్నాడు.

"శిఖీ, యిదా ఆకాశగుహ? పేరు గొప్పగానే వుంది! ఈ గొడవంతా ఏమిటి?" అని అడిగాడు విక్రమకేసరి, శిఖిముఖిని.




"ఏదో జాతర! మనం యిక్కడికి చేరే సరికి గూడెం అంతా సద్దుమణిగి వుంటుందని నేననుకున్నాను. నా పథకం అంతా పాడయింది. చెంచు దయ్యాలపోతు నేను చెప్పిన చోట నాగుమల్లిని వుంచాడో లేదో చూసి వస్తాను," అంటూ శిఖిముఖి కొమ్మ మీంచి దిగి, కంచె ద్వారం కేసి వెళ్ళాడు.

కంచె ద్వారం మూసివున్నది. కాని, శిఖిముఖి దాన్ని గట్టిగా రెండుచేతులతో పట్టి తోసేసరికి కొంచెంగా తెరుచుకున్నది. అతడు ఆ ఖాళీలోంచి లోపలికి పోయాడు. అక్కడికి దాపులనే ఒక చిన్న గుడిశె లాంటి చుట్టిల్లు అతడి కంటబడింది. లోపల



వెలుగు లేదు. దాని ముందు కాపలా వాడెవడూ అతని కంటబడలేదు. చెంచు దయ్యాలపోతు అన్నమాట ప్రకారం ఇందు లోనే, నాగుమల్లిని వుంచివుంటాడని శిఖిముఖి జాగ్రత్తగా గుడిశె దగ్గిరకు పోయి ద్వారానికి అడ్డంగా వున్న వెదురుతడికను తోసి, ఓ క్షణకాలం లోపల ఏమయినా అలికిడి అవుతుందేమో అని విని, అలాంటి దేమీ లేకపోవటంతో లోపల ప్రవేశించాడు.

గుడిశెలో ఎవరూ వున్నట్టు లేదు. అంతా చీకటిమయంగా వున్నది. శిఖిముఖి తన దగ్గిరున్న చెకుముకిరాయి కొట్టి దూది అంటించి, ఆ వెలుగులో గుడిశె అంతా



పరీక్షించి చూశాడు. గుడిశెలో ఒక మూల అతడికి రెండు మూడడుగుల పొడవున్న తాళ్ళు కనిపించినై. వాటిని పరీక్షించి చూసిన మీదట, అవి నాగుమల్లిని బంధిం చేందుకు చెంచువాళ్ళుపయోగించిన వని అతడికి అర్థమైపోయింది. అంటే—నాగు మల్లిని కొంత కాలం వాళ్ళు యీ గుడిశె లోనే వుంచారన్నమాట. అయితే ఇప్పు డామెను ఎక్కడికి తీసుకుపోయివుంటారు? తనకు వాగ్దానం చేసిన విధంగా మల్లిని కంచెద్వారం దగ్గిర గుడిశెలో దాచిన దయ్యాలపోతు, ఏ కారణం వల్ల ఆమెను మరో చోటుకు మార్చాడు?

శిఖిముఖి యిలా ఆలోచిస్తూ కాలం వృథా చెయ్యటం ప్రమాదకారణం అవుతుందను కుంటూ; తిరిగి విక్రమకేసరి వున్న చోటుకు వచ్చి, తాను చూసినది అతడికి చెప్పి, "మనల్ని చెంచుదయ్యాలపోతు మోసం చేయుటమో లేక అతణ్ణి మరొకడు మోసం చేయుటమో జరిగింది," అన్నాడు.

"అలా అయితే మనం అందరం ఒక్క సారిగా కంచె దూకి పోయి చెంచుల్ని హత మార్చి, నాగుమల్లిని వాళ్ళే గుడిశెలో దాచారో వెతికి పట్టుకుందాం," అన్నాడు విక్రమకేసరి.





శిఖిముఖి ఓ క్షణం ఆలోచించి, "కేసరీ, నువ్వు చెప్పింది బాగానే వుంది కాని, చెంచుల్ని అంత తేలిగ్గా లొంగదీయటం సాధ్యమని నాకు తోచటంలేదు. వాళ్ళు సంఖ్యలో మనకన్న కాస్త ఎక్కువే వుంటారు. పైగా, మనం వాళ్ళ మీద దాడి ప్రారంభించగానే, వాళ్ళలో కొందరు నాగుమల్లిని మరెక్కడికైనా ఎత్తుకుపోయి దాయొచ్చు. నేను లోగడే ఒక పథకం వేసి వుంచాను గదా," అంటూ కేసరికి పులి చర్మం, కపాలం చూపించాడు.



"ఏం చెయ్యబోతున్నావు? ఏమిటా పథకం?" అన్నాడు విక్రమకేసరి.

"ముందుగా మనం ఈ కంచెలోంచి పులి లోపలికి పోగలిగినంత దారి ఒకటి ఏర్పరిచ, దాన్ని బోనులో నుంచి సరైన సమయంలో బయటికి వదిలేందుకు సిద్ధంగా వుండాలి. ఈలోపల నేను లోపలికి పోయి, నాగుమల్లిని వాళ్ళు ఎక్కడ దాచారో తెలుసుకునేందుకు ప్రయత్నిస్తాను. ఒక చెంచును రహస్యంగా దొరకపుచ్చుకో గలిగితే, వాణ్ణించి ఆ రహస్యం లాగవచ్చు," అన్నాడు శిఖిముఖి.

"నువు ఒంటరిగా పోవటం ప్రమాదం అవుతుందేమో!" అన్నాడు విక్రమకేసరి.

"అలాంటి భయం ఏమీ లేదు. ఈ పులి తోలూ, కపాలం వున్నవి గదా? ఏం జరుగుతుందో నువ్వే చూద్దువుగాని. ఈ లోపల నువ్వు పులిబోను ముందు కంచె నరికించి, దాన్ని చెంచుల మీదికి వదిలేందుకు సిద్ధం చెయ్యి. నేను కపాలాన్ని చెంచుల మీదికి విసిరివెయ్యటమే అందుకు హెచ్చరిక," అని చెప్పాడు శిఖిముఖి.

విక్రమకేసరి సరేనని తన అనుచరుల దగ్గిరకు పోయి, పులిబోను ముందున్న కంచెకర్రలను కింది నుంచి మూడునాలు గడుగుల ఎత్తువరకూ నిశ్శబ్దంగా నరికి వెయ్యమన్నాడు. ఈ లోపల శిఖిముఖి





కొమ్మల మీది నుంచి లోపలికి దిగి, చీకటి ప్రాంతాల్లో నక్కుతూ గుడిసెల కేసి పోసాగాడు. హఠాత్తుగా అతడికి తా నింతకు ముందు చూసిన గుడిసె ముందుకు ఒక చెంచు చిన్న దివిటీ తీసుకుని రావటం కనిపించింది.

దివిటీతో వచ్చిన చెంచు గుడిసె ద్వారాని కడ్డంగా వున్న తడికను తోసి లోపలికి వెళ్ళాడు. అదే అదనుగా శిఖిముఖి గుడిసె ముందుకు పరిగెత్తి, ద్వారం పక్కనే నిలబడ్డాడు. చెంచువాడు దివిటీతో లోపల అంతా వెతికి ఆశ్చర్యపడుతున్నవాడిలా కళ్ళింత చేసి, ఏదో గొణగసాగాడు. శిఖి



ముఖికి వాడు అక్కడికి రావటం నాగుమల్లి కోసమన్న అనుమానం కలిగింది. వెంటనే అతడు పిల్లిలా నిశ్శబ్దంగా గుడిసె లోపలికి పోయి, వెనక నుంచి చెంచువాడి మీదికి ఎగిరి, వాడి కంఠాన్ని ఎడమచేత్తో వెనక్కి విరిచిపట్టుకుని, కుడిచేత్తో నోరు మూసి, "బతకదలిస్తే అరవకు!" అన్నాడు బుసకొడుతున్నట్టు.

చెంచువాడి చేతిలోంచి దివిటీ కింద పడిపోయింది. విడిపించుకు నేందుకు వాడే మాత్రం పెనుగులాడకుండా, శవంలా బిగదీసుకుపోయాడు. శిఖిముఖి వాడి మెడపట్టు వదిలి, చిన్న గొంతుతో, "నువ్వెక్కడి కెందుకు వచ్చావు?" అని ప్రశ్నించాడు.

చెంచువాడు కళ్ళింత చేసి, ఏదో భూతాన్ని చూసినట్టుగా శిఖిముఖి కేసి ఓమారు చూసి వణికిపోతూ, "సవర నాగుమల్లిని మా బడేదొర తీసుకురమ్మన్నాడు. అందుకోసం వచ్చాను," అన్నాడు.

"నాగుమల్లిని ఇక్కడ దాచినట్టు మీ దొరకు ఎవరు చెప్పారు?" అని ప్రశ్నించాడు శిఖిముఖి.

"భూతాలదొర!" అన్నాడు చెంచు.

"మరి నాగుమల్లి ఏమయింది? నిజం చెప్పు. అబద్ధమాడావో చంపేస్తాను,"



అంటూ శిఖిముఖి నడుం నుంచి వేలాడు తున్న చురకత్తిని పైకెత్తాడు.

"నన్ను చంపకు, దొరా! నేను బడే చెంచు మనిషిని కాదు; భూతాలదొర సొంత నౌకర్ని. ఆయన నా చేతే ఆ మల్లిని ఇక్కడ రహస్యంగా దాయించి, కంచె ద్వారాన్ని వూరికే దగ్గిరకి చేరవేసి వుంచమన్నాడు. చెప్పినట్టే చేశాను," అన్నాడు చెంచు.

"భూతాల దొర యిలా ఎందుకు చేశాడో, తెలుసా?" అని అడిగాడు శిఖిముఖి.

"బాగా తెలీదు. సవరమల్లిని, ఆకాశ దేవరకి పూజారిణ్ణి చేయబోతున్నానని అన్నాడు. ఆ మాట ఎవళ్ళతో అనొద్దన్నాడు. నే చెప్పేదంతా నిజం, నన్ను చంపకు, దొరా!" అంటూ చెంచు శిఖిముఖి కాళ్ళ మీద పడబోయాడు.

శిఖిముఖి వాణ్ణి వారించి, "అయితే పో. నన్ను చూసిన సంగతి మాత్రం ఎవరితోనూ అనకు, జాగ్రత్త!" అని హెచ్చరించాడు.

చెంచు వెళ్ళిపోయాడు. శిఖిముఖి పులి తోలు మీద కప్పుకుని, కాళ్ళమీదా చేతుల మీదా నడుస్తూ, ఆకాశగుహకు దాపుల నున్న గుడిసెల కేసి బయలుదేరాడు. అంతలో బడేచెంచు వాళ్ళున్న ప్రాంతాన పెద్ద గలభా లేచింది. శిఖిముఖి చీకటి మాటున దాగుతూ అటు వెళ్ళేసరికి, చెంచు



దయ్యాలపోతూ, శిథిలాలయ పూజారీ తగువులాడుతున్నట్టు మాట్లాడుకుంటున్నారు. వాళ్ళిద్దరి పక్కనా బడేచెంచు, "మోసం! మోసం!" అంటూ కేకలు పెడుతున్నాడు.

అసలీ గొడవకంతకూ కారణం తెలుసుకుందామన్న ఆదుర్దాలో శిఖిముఖి మరి కాస్త ముందుకు పోయేసరికి, అతడి మీద నెగళ్ళ వెలుగు పడింది. వెంటనే ఒకరిద్దరు చెంచులు "పులి! పులి!" అని అరిచారు.

బడేచెంచూ, దయ్యాలపోతూ, పూజారీ చప్పున కదిలి ఆకాశగుహ కేసి పరిగెత్తారు. వాళ్ళని ఈటెతో కొట్టాలనే ఉద్రేకంలో శిఖిముఖి లేచి నిలబడ్డాడు. పులిచర్మం జారి కిందపడింది. పారిపోయే చెంచులు అది చూసి, "పులి కాదు! మనిషి!" అంటూ వెనుదిరిగి శిఖిముఖి కేసి రాసాగారు.

శిఖిముఖి ఒక్కొక్కడుగే వెనక్కు వేస్తూ, ఈటె పైకెత్తి కంచె కేసి బయలుదేరాడు. చెంచుల కేకలు విన్న బడేచెంచూ వాళ్ళు తిరిగి నెగళ్ళ దగ్గిరకు పరిగెత్తుకు వచ్చారు. శిథిలాలయ పూజారి పట్టరాని కోపంతో పళ్ళు కొరికి, "ఆ పులివేషగాడెవరో నాకు తెలుసు! ప్రాణాలతో పట్టుకోండి!" అంటూ హుంకరించాడు.

చెంచువాళ్ళు ఈటెలు తీసుకుని శిఖిముఖి కేసి రాసాగారు. ప్రమాదం రానున్నదని గుర్తించిన శిఖిముఖి కపాలాన్ని పూజారి మీద పడేలా విసిరి, పెద్దగా ఒక కేక పెట్టాడు. మరుక్షణంలో విక్రమకేసరి బోనులో నుంచి వదిలిన పులి పెద్దగా గాండ్రిస్తూ, శిథిలాలయపూజారీ వాళ్ళున్న వైపుకు దూకింది.

"పారిపోకండి. మరొక పులివేషగాడు. చంపండి!" అంటూ శిథిలాలయ పూజారి కేకలు పెట్టాడు. పులి ఎదురైన యిద్దరు చెంచుల్ని పంజాతో కొట్టి బడేచెంచూ, పూజారీ వున్న దిశకు కుప్పించి దూకుతూ పోసాగింది. —(ఇంకా వుంది)






# వింత అపజయం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "నీ సామర్థ్యాన్ని శంకించటం కాదుగాని, జయాపజయాలను బట్టి శక్తిసామర్థ్యాలు నిర్ణయించటం సాధ్యం కాదు. అందుకు తార్కాణంగా నీకు వైశాలీ రాజకుమార్తె కువలయేశ్వరి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

వైశాలీరాజుకు లేకలేక ఒక్క కుమార్తె కలిగింది. కూతురైనా, కొడుకైనా ఆమే ననుకుని, తన అనంతరం ఆమె రాజ్య పాలన చెయ్యాలనే ఉద్దేశంతో, రాజు తన కుమార్తెకు కువలయేశ్వరి అని పేరు పెట్టి, ఆమెకు చిన్నతనం నుంచే యుద్ధవిద్యలు దీక్షగా నేర్పించాడు. ఒక వంక అశ్వా

## బేతాళ కథలు




రోహణా, విలువిద్యా, కత్తిసామూ మొదలైన విద్యలు నేర్చుకుంటూ, మరో వంక ఆమె రాజ్యపాలనా, మంత్రాంగమూ, నీతిశాస్త్రాలూ అభ్యసించి, అన్నింటా ఉత్తీర్ణురాలయింది.

కువలయేశ్వరికి యుక్తవయసు రాగానే ఆమెకు వివాహం చెయ్యాలని సంకల్పించాడు రాజు. యుద్ధవిద్యలలో తనను మించగలవాణ్ణే తాను చేసుకుంటానని కువలయేశ్వరి తండ్రితో అన్నది. రాజు అందుకు సమ్మతించి, స్వయంవరం ఏర్పాటు చేసి, నానాదేశపు రాజకుమారులకూ ఆహ్వానాలు పంపాడు.



స్వయంవరానికి అనేకమంది రాజకుమారులు వచ్చారు. అందులో చాలామంది రాజకుమార్తెతో పోటీకి తయారై వచ్చారు. అందరి ఎదటా రాజకుమార్తె తనకు గల శక్తులన్నిటినీ ప్రదర్శించింది. కొత్తగా తెచ్చిన అడవిగుర్రాలను ఆమె అదుపు చేసి, వాటి మీద స్వారీచేసింది; తన విలువిద్యను రకరకాలుగా ప్రదర్శించింది. ఈ ప్రదర్శనలన్నింటా ఆమెకున్నంత సామర్థ్యం తమకు కూడా ఉన్నట్టు నిరూపించుకున్నవాళ్ళు, చివరి పరీక్షగా, ఆమెను కత్తియుద్ధంలో ఓడించాలి. అలా ఓడించినవాణ్ణి ఆమె పెళ్ళాడుతుంది.

కొందరు అడవిగుర్రాలను మచ్చిక చేయలేకపోయారు. మరి కొందరు విలువిద్యలో శబ్దవేది, మత్స్యయంత్రం మొదలైన వాటిలో అపజయం పొందారు. ఒకరిద్దరు మాత్రం వీటన్నిటా ప్రావీణ్యం చూపి, కత్తియుద్ధంలో కువలయేశ్వరికి ఓడిపోయారు.

కాని మంగళాపురం రాజకుమారుడు రాజశేఖరు డనేవాడు అన్ని విద్యలలోనూ రాజకుమార్తెతో సమాను డనిపించుకోవటమే గాక, కత్తియుద్ధం చేస్తూ రాజకుమార్తె చేతి నుంచి కత్తిని ఎగరగొట్టేశాడు.





కువలయేశ్వరి ఓడిపోయి తలవంచు కున్నది. అందరూ హర్షధ్వానాలు చేశారు. పందెంలో నెగ్గినవాడు రూపవంతుడూ, యువకుడూ కావటం రాజుకు కూడా పరమానంద మయింది. ఆయన కువల యేశ్వరితో, "అమ్మా, అతని మెడలో వరమాల వెయ్యి!" అన్నాడు.

రాజశేఖరుడు చెయ్యెత్తి రాజును వారిస్తూ, "కొంచెం ఆగండి. ఈ పోటీలలో ఇంతవరకు పాల్గొననివాళ్ళు ఇంకా చాలా మంది ఉన్నారు. వారిలో ఎవరైనా నన్ను కత్తియుద్ధంలో ఓడించగలిగినట్టయితే, ఈ నా విజయం అబద్ధ మవుతుంది. అందుచేత ఇష్టమున్నవారు నాతో కత్తియుద్ధం చెయ్య వచ్చు," అన్నాడు.

అతనితో కత్తియుద్ధం చెయ్యటానికి ఇద్దరు ముగ్గురు ముందుకు వచ్చి, అతని చేతిలో ఓడిపోయారు. ఇంతలో చీకటి కూడా పడిపోయింది. కార్యక్రమాన్ని మర్నాటికి వాయిదా వేసి అందరూ బసలకు వెళ్ళిపోయారు.

మర్నాడు ఉదయం అందరూ సమా వేశం అయినప్పుడు రాజశేఖరుడు, తనతో కత్తియుద్ధానికి వచ్చేవారిని ఆహ్వానించాడు. తేజవర్మ అనే రాజపుత్రుడు ముందుకు వచ్చాడు.



ఇద్దరూ కత్తియుద్ధం చేశారు. కొద్దిసేప ట్లోనే రాజశేఖరుడు తేజవర్మ చేతిలో ఓడి పోయాడు. ప్రేక్షకులు హాహాకారాలు చేశారు. రాజశేఖరుడు పెట్టిన నియమం ప్రకారం అతన్ని ఓడించినవాడు కువల యేశ్వరిని పెళ్ళాడవచ్చు.

రాజు తన కుమార్తెతో, తేజవర్మ మెడలో వరమాల వెయ్యమన్నాడు.

కాని తేజవర్మ రాజును వారించి, "కత్తి యుద్ధంలో రాజకుమార్తెను ఓడించినవాడే ఆమెను పెళ్ళాడాలని నియమం ఏర్పాటు చేశారు. నేను రాజకుమార్తెను ఓడించలేదు. అందుచేత నే నామెను పెళ్ళాడటం నియమ విరుద్ధం అవుతుంది," అని అభ్యంతరం తెలియపరిచాడు.

రాజుకు చిరాకు వేసింది. "అలా అయితే నువు రాజకుమార్తెతోనే యుద్ధం చెయ్యి," అన్నాడాయన తేజవర్మతో.

తేజవర్మా, కువలయేశ్వరీ కత్తియుద్ధం చేశారు. తేజవర్మ ఓడిపోయాడు. రాజశేఖ రుడే పందెంలో గెలిచినట్టు ప్రకటించి, రాజుగారు తన కుమార్తెను అతడికిచ్చి వైభవంగా పెళ్ళిచేశాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, ఈ కథలో నాకు కొన్ని విషయాలు అంతు బట్టటం లేదు. రాజకుమార్తెను కత్తి



యుద్ధంలో ఓడించిన రాజశేఖరుడు అంతటితో తృప్తిపడి ఆమెను పెళ్ళాడక, మిగిలిన వాళ్ళను కత్తియుద్ధానికి ఎందుకు ఆహ్వానించాడు? అతన్ని ఓడించిన తేజవర్మ అయినా రాజకుమార్తెను పెళ్ళాడక, పేచీ పెట్టి రాజకుమార్తెతో మళ్ళీ ఎందుకు కత్తి యుద్ధం చేశాడు? చేసినవాడు ఎలా ఓడాడు? రాజశేఖరుడూ, తేజవర్మా, రాజకుమార్తే కూడా కత్తి యుద్ధంలో ఒకరిని ఒకరు ఓడించారు గదా, వీరిలో నిజంగా ఎవరు గొప్ప అయినదీ ఎలా తెలుసుకోవటం? ఈ అనుమానాలకు సమాధానాలు తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఈ కత్తి యుద్ధాలన్నీ బూటకంగానే కనబడుతున్నాయి. రాజశేఖరుడు అందగాడు. రాజకుమార్తె కావాలనే అతని చేతిలో ఓడిపోయింది. అతనికి రాజకుమార్తెను పెళ్ళాడాలని లేదు. అందుచేత అతను మరెవరిచేతనైనా ఓడిపోదామని ఇతరులను ఆహ్వానించాడు. ఒకరిద్దరు వచ్చారుగాని, వారు అతనికి ఓడే అవకాశం ఇవ్వక తామే ఓడారు. తేజవర్మ ఏమరుపాటున ఉండి రాజశేఖరుణ్ణి ఓడిపోనిచ్చాడు. తీరా గెలిచాక అతనికి రాజకుమార్తెను పెళ్ళాడవలిసి వస్తుందని భయం పట్టుకున్నది. అందుచేత రాజకుమార్తెతో కత్తియుద్ధం చేస్తానన్నాడు. ఆమె అదివరకే రాజశేఖరుణ్ణి వరించి ఉన్నట్టు స్పష్టమయింది గనక, ఆమె తన చేతిలో ఓడదని అతనికి తెలుసును. అందుచేత అతను ఆమె చేతిలో సులువుగా ఓడాడు. ఈ గందరగోళానికంతకూ మూల కారణం రాజకుమార్తె అనాకారి తనమే అని తోస్తుంది," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)



# బిచ్చగాడి నిధి

ఒక పేద రైతు ఒకనాడు పొలంలో పని చేసి అలసిపోయి, ఇంటికి వచ్చి, నడుము వాల్చి, "ఓ దేవుడా! నా కొక చిన్న నిధి ఇవ్వలేవా?" అని ప్రార్థన చేశాడు.

అకస్మాత్తుగా అతని ముందొక సంచీ పడింది. మరుక్షణమే అతనికి ఇలా వినపడింది: "ఈ సంచీలో నీకు ఒక బంగారు నాణెం దొరుకుతుంది. దాన్ని తీస్తే ఇంకొకటి దొరుకుతుంది. తడవకు ఒకటి చొప్పున దాని నుంచి నీకు ఎన్ని నాణాలైనా దొరుకుతాయి. నీకు చాలినన్ని తీసుకున్నాక, ఈ సంచీని నదిలో పారెయ్యి. అయితే ఒక్కటి గుర్తుంచుకో— సంచీని నదిలో పారేసేదాకా నువ్వా డబ్బును ఖర్చు చెయ్యరాదు. అలా ఖర్చు చేశావో, నువు తీసిన డబ్బు యావత్తూ మాయమవుతుంది."

రైతు పరమానందం చెంది, ఆ రాత్రల్లా సంచీలో నుంచి బంగారు నాణాలు తీసి, ఒక గోతం నించాడు. మర్నాడు అతనికి ఇంట్లో తిండి లేదు. సంచీని నదిలో పారేసిన దాకా బంగారాన్ని వాడటానికి లేదు. ఇంకొక్క రాత్రి అంతా కూర్చుని ఇంకొక గోతం నించి, తరవాత సంచీని నదిలో పారేద్దామనుకున్నాడు.

ఇలా చాలా రోజులు గడిచాయి. గోతాలు బంగారు నాణాలతో నిండుతున్నాయి. రైతు రోజూ బిచ్చమెత్తి పొట్ట నింపుకుంటున్నాడు.

చివరకు ఒకనాడు అతను చనిపోయాడు. ఇరుగు పొరుగువాళ్ళు వచ్చి చూసి, ఆ బిచ్చగాడి ఇంటి నిండా గోతాల కొద్దీ బంగారు నాణాలుండటం చూసి నిర్ఘాంతపోయారు.





# వెర్రి బ్రాహ్మడు

పూర్వం కాశీక్షేత్రంలో ఒక పేద బ్రాహ్మడు ఉండేవాడు. అతను మందమతి కావటం చేత కేవలమూ ముష్టిఎత్తి తన పొట్టపోసుకునేవాడు. ఆ విధంగానే అతను కొంత డబ్బు మిగిల్చాడు. ఆ డబ్బుతో మరో గ్రామం వెళ్ళి, అక్కడ బతుకుదామనిపించింది బ్రాహ్మడికి. అందులో నుంచి కొంత డబ్బు ఖర్చు చేసి చిన్న పట్టుగుడ్డముక్క కొని, అందులో తన డబ్బంతా మూటగట్టి, దారి ఖర్చుకు మాత్రం కొంత డబ్బును రొండిన దోపుకుని, అడవిమార్గాన బయలుదేరాడు. పోయేవాడు సరిగా పోక, తన డబ్బు మూటను ఎగరేసి పట్టుకుంటూ, మహా ఉత్సాహంగా నడవసాగాడు.

దారిలో అతనికి ఎదురైన ప్రయాణీకులు కొందరు, "ఏమయ్యా, బ్రాహ్మడా? ఆ డబ్బులమూటను అలా ఎగరెయ్యక, దాచి పెట్టుకుని మరీ వెళ్ళు. ఈ తోవలో దొంగల ముఠాలు తిరుగుతున్నాయి," అని హెచ్చరించారు.

"దొంగలకు నా డబ్బుమూట అందనిస్తానా ఏమిటి? నేనేనా అంత పిచ్చివాణ్ణి?" అనుకుని ఆ వెర్రిబ్రాహ్మడు ఒక పొడుగైన కర్ర సంపాదించి, దాని చివర డబ్బుమూటను కట్టి, కర్ర నిటారుగా పట్టుకుని నడవసాగాడు.

బ్రాహ్మడు కొంత దూరం వెళ్ళాక అతనికి నలుగురు దొంగలు ఎదురుపడ్డారు. వాళ్ళు దొంగలని ఎరగక బ్రాహ్మడు వాళ్ళతో, "ఏమండోయ్, ఈ దారిన దొంగవెధవలున్నారుట, కాస్త జాగర్తగా ఉండండి. నేను, చూశారా, దొంగలకు అందకుండా నా డబ్బుమూట ఎంత ఎత్తుగా పట్టుకున్నానో?" అన్నాడు.

ఈ మాటకు దొంగలు విరగబడి నవ్వారు. వారిలో ఒకడు బ్రాహ్మణ్ణి చాచి

జి. శిఖామణి




చెంపపెట్టు పెట్టాడు. బ్రాహ్మడు "బాబోయ్!" అంటూ తన చేతికర్రను జార విడిచి, చెంప తడుపుకున్నాడు.

దొంగలు బిగ్గరగా నవ్వి, బ్రాహ్మడి డబ్బుమూట తీసుకుని, బయలుదేరారు.

"వీళ్ళేనా ఏమిటి దొంగలంటే? నేను ముష్టెత్తి కొనుక్కున్న నా పట్టుగుడ్డను ఎవరికో చవకగా అమ్మేస్తారు కాబోలు," అని భయపడి ఆ బ్రాహ్మడు, "ఇదుగోనోయ్! డబ్బు తీసుకుంటే తీసుకున్నారు. ఆ పట్టు గుడ్డ నాకే అమ్మండి!" అని కేకపెట్టాడు.

ఆ బ్రాహ్మడి దగ్గిర ఇంకా డబ్బున్నదని తెలిసి, దొంగలు వెనక్కు తిరిగి వచ్చి, అతను రొండిన దాచిన డబ్బు కూడా లాగేసుకుని మళ్ళీ బయలుదేరారు.

"నేను ఏడాది కష్టపడి సంపాదించిన దంతా ఈ దింగలు అయిదునిమిషాలలో కాజేశారే! వీళ్ళ వృత్తే బాగున్నది," అనుకుని బ్రాహ్మడు దొంగలను కేకపెట్టి ఆపి, "ఇదుగో, దొంగలూ! నన్ను కూడా మీతో చేర్చుకోండి!" అన్నాడు.

వాళ్ళు సరే నన్నారు. అందరూ కలిసి ఆ రాత్రికి ఒక గ్రామం చేరారు. దొంగలు ఒక మట్టిగోడల ఇంటికి కన్నంవేసి, బ్రాహ్మణ్ణి లోపలికి పంపారు.

అది ఒక ముసలి బ్రాహ్మణస్త్రీ ఇల్లు. ఆ రోజు సరస్వతీపూజ కావటంచేత ఆ రాత్రి ముసలమ్మ గారెలు చేస్తూచేస్తూ, గుండెలో బాధ కలిగినట్టనిపించి, అవతలికి వెళ్ళి పడుకుని, ప్రాణాలు వదిలింది.

బ్రాహ్మడికి ఇంట్లో ప్రవేశిస్తుండగానే గారెల వాసన తగిలింది. తనకు ఆకలి దహించుకుపోతున్న సంగతి వెంటనే తట్టింది. అతను దొంగల గొడవే మరిచి పోయి, స్నానాలగది వెతుక్కుంటూ వెళ్ళి, స్నానం చేసి, చప్పున సంధ్యవార్చి, ముస లమ్మ పడుకుని ఉన్న చోటికి వచ్చి, "వడ్డించవమ్మా!" అన్నాడు.

ముసలమ్మ పలకలేదు. ముసలమ్మను తాకటం ఇష్టంలేక, పొయ్యి మీద నూనె కాస్త గరిటెతో తెచ్చి, ఒక చుక్క ముసలమ్మ చేతి మీద వేశాడు. అప్పటికీ ముసలమ్మలో చలనం లేదు. ఇక తప్పనిసరి అయి ముసలమ్మను తట్టాడు. ముసలమ్మ కళ్ళు తెరుచుకునే ఉన్నది—కాని శవం!

బ్రాహ్మడు అదిరిపోయి, కెవ్వున ఒక కేక పెట్టి, చప్పున ఇంటి దూలం మీదికి ఎక్కి, వణుకుతూ కూర్చున్నాడు. బ్రాహ్మడు తమను పిలిచాడనుకుని దొంగలు కూడా లోపలికి వచ్చారు. కాని ఇంతలోనే, బ్రాహ్మడు పెట్టిన కేకకు ఇరుగు పొరుగు వాళ్ళంతా వచ్చారు. దొంగలు మంచాల కింద దూరి దాక్కున్నారు.

ఇరుగుపొరుగువాళ్ళు ముసలమ్మ చచ్చిపోయిందని చూసి, "ఎలా పోయివుంటుంది? ఏం జరిగి ఉంటుంది?" అని ఒకరినొకరు ప్రశ్నించుకున్నారు.

"ఒక రోగమూ రొష్టూ లేదు! సరస్వతీ పూజ అని గారెలు కూడా చేస్తున్నది! మరి ఎలా పోయిందో ఆ పైవాడికే తెలియాలి!" అన్నారు ఒకరు.

"అది నిజమే! వాడికే తెలియాలి!" అన్నారు ముగ్గురు, నలుగురు. ఇది వింటున్న బ్రాహ్మడికి మండిపోయింది.

"అయితే ఆ ముసలిముండని నేనే చంపానంటారా ఏమిటి? నే నే పాపమూ ఎరగను. కావలిస్తే మంచం కింద దాగిన నలుగురు దొంగల్ని అడగండి!" అన్నాడు బ్రాహ్మడు దూలం మీది నుంచి.

ఇంకేముందీ దొంగలు దొరికిపోయారు. గ్రామాధికారి బ్రాహ్మడి సాక్ష్యంతో దొంగలను విచారణ చేసి, బ్రాహ్మడి డబ్బు బ్రాహ్మడికి ఇప్పించాడు. ఊరివైద్యుడు ముసలిదాన్ని చూసి, "జబ్బేమీ లేదు. వృద్ధాప్యం వల్ల పోయింది. పర్వదినాన పోయింది, పుణ్యాత్మురాలు!" అన్నాడు.



# డేగ - గరుడపక్షి

ఒక జమీందారుగారికి గ్రామశిస్తు చెల్లించటానికి ఒక చిన్న గ్రామం నుంచి ఒక మనిషి వెళ్ళాడు. ఆ జమీందారు ఆ మనిషితో అవీ, ఇవీ మాట్లాడి, "ఒక డేగపిల్లను పెంచాలని ఉంది. మీ గ్రామంలో డేగపిల్ల లేవైనా ఉన్నాయా?" అని అడిగాడు.

"లేకేమండి? మా ఇంటి వెనకనే ఒక గుట్ట మీద డేగల గూడున్నది. అందులో పిల్లలున్నాయి," అన్నాడు గ్రామస్థుడు.

"భేష్! నేను వీలు చూసుకుని మీ గ్రామం వచ్చి డేగపిల్లలను తీసుకుంటాను," అన్నాడు జమీందారు.

ఆ మనిషి తన గ్రామం వెళ్ళి ఈ మాట చెప్పేసరికి గ్రామంలో వాళ్ళంతా లబలబలాడి, "జమీందారు వస్తే ఆయనకు ఈ దిక్కుమాలిన చోట బస ఎలా ఏర్పాటు చేస్తాం? ఆయన ఆతిథ్యానికి అయే ఖర్చు ఎలా భరిస్తాం? ఏం పని చేశావు?" అన్నారు.

తాను చేసిన పనికి తానే విరుగుడు చెయ్యాలనుకుని ఆ గ్రామస్థుడు, కొన్ని వారాలు పోనిచ్చి మళ్ళీ జమీందారుగారి ఊరు వెళ్ళాడు. జమీందారు అతన్ని చూడగానే, "డేగపిల్లలు బాగా ఎదిగి వస్తున్నాయా?" అని అడిగాడు.

"బాగా పెరుగుతున్నాయండి. అప్పుడే 'కృష్ణా!' అని అరుస్తున్నాయి," అన్నాడు గ్రామస్థుడు.

"ఛీ, ఛీ! అలా అయితే అవి గరుడపక్షులు! నాకవసరం లేదులే," అన్నాడు జమీందారు.





# ఇదా శిక్ష?

తాతయ్య దగ్గిరికి ఫిర్యాదు వచ్చింది:

"తాతయ్యా, తాతయ్యా! మన చిన్నవాడే అమ్మను నెత్తి మీద కొట్టాడు."

తాతయ్య చిన్నవాడి కేసి తిరిగి, "ఏం రా, అమ్మను కొట్టావూ? ఎందుకు కొట్టావూ?" అని అడిగాడు.

"పీచుమిఠాయి కొంటానికి పది పైసలియ్యమంటే అమ్మ ఇయ్య లేదు, తాతయ్యా!" అన్నాడు చిన్నవాడు ఏడుపు గొంతుతో.

"ఓరి, భడవా! ఇంద పది పైసలు!" అంటూ తాతయ్య బొడ్డు నుంచి పది పైసల నాణెం తీసి చిన్నవాడి కిచ్చాడు.

మిగిలిన పిల్లలకు ఇది ఆశ్చర్య మనిపించింది.

"అదేమిటి, తాతయ్యా? అమ్మను కొట్టినందుకు వాణ్ణి శిక్షించక పోగా డబ్బిస్తున్నావా?" అన్నారు వాళ్ళు.

"శిక్షించటం ఎందుకు? సుల్తాను కథ వినలేదుట్రా?" అన్నాడు తాతయ్య పొడుంకాయ తీస్తూ.

"చెప్పు, తాతయ్యా? సుల్తాను ఏం చేశాడు, తాతయ్యా?" అంటూ పిల్లలు తాతయ్య చుట్టూ చేరారు.

తాతయ్య తాపీగా పొడుం పీల్చి, కథ చెప్పసాగాడు:

ఒక నగరంలో ఒక సుల్తా నుండేవాడు. ఆ సుల్తాను కొక పెద్ద తోట ఉండేది. అందులో జహంగీరు మామిడి చెట్లుండేవి. వానా వంగుడూ లేనప్పుడల్లా సాయంత్రం వేళ సుల్తాను ఆ తోటలోకి వెళ్ళి, అక్కడ తన మంత్రులతో మాట్లాడుతూ కాలక్షేపం చేసేవాడు.

ఆ వూళ్ళోనే ఒక బిచ్చగా డుండేవాడు. వాడు ఊరంతా తిరిగి బిచ్చ మెత్తి, పొట్ట పోసుకుంటూ ఉండేవాడు. ఎండా కాలంలో

మాదవరెడ్డి చంద్రశేఖర్

ఒక రోజున వాడికి ఊళ్లో ఎవరూ ఒక్క దమ్మిడీ కూడా ఇవ్వలేదు. ఆకలి మండి పోతున్నది. సాయంకాలం దాకా ఊరంతా చెడ తిరిగి వాడు చాలా అలిసిపోయి, సుల్తానుగారి ఉద్యానవన ప్రాంతానికి చేరుకున్నాడు.

అందులో గొప్ప జాతి మామిడి చెట్లున్నాయని చెప్పాను కాదూ? వేసవికాలం కావటం చేత ఆ చెట్లకు మామిడిపళ్ళు కూడా ఉన్నాయి.

ఆ పళ్ళను చూసేసరికి బిచ్చగాడి ఆకలి రెట్టింపయింది. ఆ ఆకలి బాధకు తట్టుకోలేక వాడేం చేశాడంటే, ఒక రాయి తీసుకుని గురిపెట్టి ఒక పళ్ళ గుత్తిని కొట్టాడు. రెండు పళ్ళు కింద రాలాయి. వాడు అవు రావురని వాటిని తిని తన ఆకలిబాధ తీర్చుకోసాగాడు.

అంతతో తీరిపోయిందా? లేదు! వాడు విసిరిన రాయి మామిడిపళ్ళకు తగిలి, అవతల కూర్చుని ఉన్న సుల్తానుగారి మాడుకు తగిలింది. మాడు మీద ఇంత బొప్పి కూడా కట్టింది.

వెంటనే సుల్తానుగారు మండిపడుతూ, "ఎవడ్రా బద్మాష్? నా మీద రాయి విసిరాడు! వాణ్ణి పట్టి ఈడ్చుకురండి!" అని భటులను పంపాడు.



భటులు వచ్చి, మామిడిపళ్లు తింటున్న బిచ్చగాణ్ణి చూసి, వాడే రాయి విసిరాడని గ్రహించి, వాణ్ణి జరజరా సుల్తానుగారి దగ్గిరికి ఈడ్చుకు పోయారు.

"ఏమిరా, లుచ్ఛా? నువేనా ఈ రాయి విసిరింది?" అంటూ సుల్తాను తన నెత్తి మీద పడ్డ రాయిని చూపించాడు.

"అవును, హుజూర్!" అన్నాడు బిచ్చగాడు భయంతో వణికిపోతూ.

"ఎందుకు చేశా వా పని?" అని సుల్తాను మళ్ళీ అడిగాడు.

"ఆకలయింది, హుజూర్. రోజల్లా ఒక్క మెతుకు తినలేదు. చెట్టున పళ్ళు కనిపించాయి. రాయి విసిరాను. రెండు పళ్ళు రాలాయి. ఆకలి తీర్చుకున్నాను," అంటూ బిచ్చగాడు ఏమీ దాచకుండా ఉన్నమాట చెప్పేశాడు.

సుల్తాను కొంచెం ఆలోచించి తన కోశాధికారి కేసి తిరిగి, "ఈ బిచ్చగాడికి నెలనెలా పది బంగారు దీనారాలు యావజ్జీవం మన ఖజానా నుంచి ఇప్పించండి!" అన్నాడు.

మంత్రులందరూ నిర్ఘాంతపోయి, "రాయి వేసినందుకు వాణ్ణి శిక్షించక బహుమానం ఏర్పాటు చేస్తున్నారా, హుజూర్?" అని అడిగారు.

"మీకు కొంచెం కూడా బుర్రలేదు. మామిడి చెట్టు గొప్పదా, నేను గొప్పవాణ్ణా?" అని అడిగాడు సుల్తాను.

"ఏంతమాట సెలవిచ్చారూ! మీ రెక్కడ? ముష్టి మామిడి చెట్టెక్కడ?" అన్నారు మంత్రులు.

"రాయిపెట్టి కొట్టినందుకు ఆ మామిడి చెట్టు వీడి ఆకలి తీర్చింది గదా? వీడికి ఎన్నడూ ఆకలిబాధ రాకుండా చూసేపాటి జ్ఞానం నా కుండక్కర్లేదా? ఆ రాయేగదా నన్ను కూడా కొట్టింది?" అన్నాడు సుల్తాను.

సుల్తానుగారి జ్ఞానాన్ని మంత్రులందరూ మెచ్చుకున్నారు.





# రాజుగారిసమస్య

ఒక నగరానికి ఒక రాజు ఉండేవాడు. అతను ఏమంత తెలివి తేటలు గల వాడు కాడు.

ఒకనాడు ఒక బ్రాహ్మణుడు రాజుగారి ఇంట పురాణం చదువుతూ, యమలోకం గురించీ, అక్కడ రకరకాల పాపాలు చేసిన వాళ్ళు పొందే శిక్షలను గురించీ చదివి విని పించాడు.

పురాణ శ్రవణం అయిపోయాక రాజు ఆ బ్రాహ్మడితో, "శాస్తుల్లుగారూ, మీకు స్వర్గ నరకాలను గురించి ఇంత బాగా తెలుసు కదా, ఒక్క అనుమానం తీర్చండి! మనకు తెలిసినంత వరకు పైన ఆకాశం ఉన్నది కింద భూమి ఉన్నది. ఈ భూలోకంలో అనేక విధములైన ప్రాణులున్నాయి. వీటిలో కొన్ని స్వర్గానికీ, మరికొన్ని నరకానికీ ఎలా పోతాయి? ఇది వివరించి చెప్ప గలరా?" అన్నాడు.

ఈ ప్రశ్న విని బ్రాహ్మడు ముందు ఆశ్చర్యపోయి, తరవాత భయపడ్డాడు. సమాధానం చెప్పలేకపోతే రాజు ఏం చేస్తాడో నని భయం!

"మహారాజా, తమ రడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పాలంటే శాస్త్రాలన్నీ పరిశీ లించవలిసి ఉంటుంది. నాకు కొంచెం వ్యవధి ఇవ్వండి," అని చెప్పి, ఆ బ్రాహ్మడు ఆ రాత్రే తన గ్రామానికి పారిపోయాడు.

మర్నాడుదయం రాజుగారు బ్రాహ్మడు పారిపోయిన సంగతి తెలుసుకుని, తన ప్రశ్నకు సమాధానం చెప్పలేకనే పారి పోయాడని ఊహించాడు. తన ప్రశ్న చాలా గొప్పది అయి ఉంటుందనుకుని ఆ రాజు కనపడ్డ వారి నందరినీ అదే ప్రశ్న అడగసాగాడు.

త్వరలోనే రాజ్యంలో అందరికీ "రాజు గారి సమస్య" గురించి తెలిసిపోయింది.

టి. పి. గోపాలకృష్ణమూర్తి





పురాణం చెప్పే బ్రాహ్మడికి ఒక కొడుకుండేవాడు. వాడు వట్టి రాలుగాయి. అస్తమానమూ తల్లిని వేధించుకు తినేవాడు. ఒకనాడు ఆమె గోధుమలు విసురుతూండగా కొడుకు వచ్చి వేధించాడు.

"వెధవా, అవతలికిపో. ఆ రాజుగారి సమస్య నీకు వచ్చినా బాగుండేది!" అన్నది తల్లి విసుక్కుంటూ.

"సమస్యలు మనబోటి వాళ్ళకు కాకుండా రాజుగారికి కూడా వస్తాయా? ఏమిటా సమస్య?" అని కొడుకు అడిగాడు, తల్లికెదురుగా కూర్చుని తాను కూడా తిరగలి విసురుతూ.

"మనకు కనబడేది పైన ఆకాశమూ, కింద భూమి మాత్రమే గదా, ఈ భూమి మీద కోట్ల సంఖ్యలో ఉండే ప్రాణులు కొన్ని స్వర్గానికీ, మరికొన్ని నరకానికీ ఎలా పోతున్నాయో రాజుగారికి ఎవరన్నా చెప్పాలిట. అదీ రాజుగారి సమస్య," అంటూ బ్రాహ్మడి భార్య తిరగలి పై రాయి ఎత్తి చూసింది. అప్పుడు తిరగట్లో కొన్ని గింజలు నలిగి ఉండటమూ, మరికొన్ని నలగకుండా ఉండటమూ బ్రాహ్మడి కొడుకు చూశాడు.

వెంటనే వాడి కేదో తట్టింది. వాడు సరాసరి రాజభవనానికి వెళ్ళి, "నాకు రాజుగారి దర్శనం కావాలి," అని ద్వారపాలకులను అడిగాడు.

వాడి అవతారం చూసి, "రాజుగారు నీ బోటి వాళ్ళకి దర్శనం ఇవ్వరు," అన్నారు ద్వారపాలకులు.

"నేను రాజుగారి సమస్య తీర్చటానికి వచ్చాను. ఈ మాట రాజుగారికి చెప్పండి," అన్నాడు బ్రాహ్మడి కొడుకు.

తన సమస్య తీర్చేవాడు వచ్చాడనగానే రాజు బ్రాహ్మడి కొడుకును లోపలికి రానివ్వమని అజ్ఞయిచ్చాడు. కాని తీరా వాడి వాలకం చూశాక రాజుగారికి వాడిలో నమ్మకం చిక్కలేదు.



"నా సమస్య నీకు సరిగా అర్థమయిందా? నువ్వు నిజంగా సమాధానం చెప్పగలవా?" అన్నాడు రాజు వాడితో.

"నోటితో చెప్పటం కాదు. ప్రత్యక్షంగా చూపిస్తాను," అన్నాడు బ్రాహ్మడి కొడుకు.

రాజుగారు వెంటనే తన ప్రధానసభికు లందరితో సభ తీరి, బ్రాహ్మడి కొడుకును తన సమస్యకు సమాధానం చెప్పమన్నాడు.

"ఒక తిరగలీ, ఇన్ని గోధుమలూ తెప్పించండి," అన్నాడు బ్రాహ్మడి కొడుకు.

తిరగలీ, గోధుమలూ వచ్చాయి. బ్రాహ్మడి కొడుకు పట్టెడు గోధుమలు తిరగట్లో పోసి విసురుతూ, "చూడండి, మహారాజా! ఈ పైన తిరిగే రాయి ఆకాశం. కింద కదలకుండా ఉండే రాయి భూమి. ఇందులో పోసిన గోధుమలు జీవరాసులు. పోసేవాడు భగవంతుడు. ఈ చేతి అయిదు వేళ్ళూ పంచభూతాలు. తిరగలిపిడి యమధర్మరాజు. పాపులను ఇలా హింసిస్తాడు," అంటూ పై రాయి ఎత్తి, "చూశారా, మహారాజా? చాలా గింజలు నలిగి యమయాతన అనుభవించాయి. కాని కొన్ని గింజలు చెక్కు చెదరకుండా ఉండిపోయాయి. ఇవి యమలోకాన్ని తప్పించుకున్న జీవులు! వాటికి నరకభయం లేదు!" అని ముగించాడు.

రాజు పరమానందం చెంది, "అహా! ఎంత జ్ఞానివి! నువ్వు ఎవరి కొడుకువు, నాయనా?" అని అడిగాడు.

"మీకు పురాణం చెప్పిన శాస్త్రుల్లుగారి అబ్బాయిని, మహారాజా!" అన్నాడు బ్రాహ్మడి కొడుకు.

"నీ తండ్రి కన్న నువే గొప్పవాడివి!" అని చెప్పి, రాజుగారు వాడికి దుశ్శాలువలూ, కట్నాలూ ఇచ్చి, సన్మానించి పంపేశాడు. ఈ సన్మానం ఫలితంగా బ్రాహ్మడి కొడుకు రాలుగాయ లక్షణాలు మాని, పెద్ద మనిషిగా జీవించసాగాడు.





# ఇద్దరు కర్షకులు

రంగపూరు రాజ్యంలో రామూ, సోమూ అని ఇద్దరు రైతు లుండేవారు. వాళ్ళు ఇరుగూ, పొరుగూగా నివసిస్తూ, ఎంతో స్నేహంగా ఉండేవారు. వాళ్ళ రెండు కుటుంబాలూ ఏక కుటుంబంలా గుండేవి.

రామూ తన ఆవరణలో ఒక తోట పెంచాడు. సోమూ తన ఆవరణలో కూరగాయలు మాత్రమే పెంచేవాడు. ఇద్దరూ తమ కృషిలో ఆరితేరిన వాళ్ళే. వాళ్ళు బాగా డబ్బు సంపాదించుకోవటమే గాక, పెద్ద పేరు కూడా గణించారు.

ఒకనాడు సోమూ తన కూతురిని చూడబోతూ రామూను కూడా వెంట బెట్టుకు పోయాడు. ఇద్దరూ అక్కడ రెండు రోజులు గడిపి, తమ గ్రామానికి తిరిగి వస్తూండగా, దారిలో ఒక గ్రామంలో సంత తగిలింది. అక్కడ వాళ్ళు తమకు కావలిసిన సరుకులు కొనుక్కున్నారు. ఒక దుకాణంలో రెండు నిమ్మమొక్కలు కనిపించాయి. రామూ వెంటనే వాటిలో ఒకటి కొన్నాడు. అప్పుడు సోమూ మిగిలిన రెండో నిమ్మమొక్కను తాను కొనుక్కున్నాడు. సోమూ ఈ పని చెయ్యటం రామూకు అంతగా నచ్చలేదు. ఎందు చేతనంటే, ఫలవృక్షాలు పెంచే పని రామూదనీ, కూరగాయలు పండించే పని సోమూదనీ ఏ నాడో వాళ్ళు నిశ్చయం చేసుకున్నారు. అలా జరిగినంత కాలమూ వారి మధ్య పోటీకి అవకాశం ఉండదు. కాని సోమూ తనతోపాటు నిమ్మమొక్క కొనేశాడు. అందువల్ల తనకు కలిగిన అసంతృప్తిని రామూ పైకి కనబడనివ్వలేదు. ఇద్దరూ మామూలుగానే కబుర్లు చెప్పుకుంటూ స్వగ్రామానికి తిరిగి వచ్చేశారు.

కొద్ది సంవత్సరాలు గడిచాయి. సోమూ కొన్న నిమ్మమొక్క విషయం రామూ పూర్తిగా మరిచిపోయాడు. రామూ నాటిన



నిమ్మమొక్క గుంటపూలు పూస్తున్నది. ఫలవృక్షాల పెంపకంలో దిట్ట అయి ఉండి కూడా రాముా ఆ మొక్క చేత సరిగా కాయించలేక పోయాడు. తనవల్లనే కానిపని సోముా వల్ల ఏమవుతుంది?

కాని ఒకనాడు సోముా కొడుకు ఒక బుట్టెడు నిమ్మకాయలు, పెద్ద పెద్దవి, తెచ్చి రాముా కిస్తూ, "మా నాన్న నీ కిచ్చి రమ్మన్నాడు," అని చెప్పాడు.

"ఎక్కడివిరా ఈ నిమ్మలూ?" అని రాముా అడిగాడు.

"మా చెట్టున కాసినవే!" అన్నాడు సోముా కొడుకు.



రాముా మనసులో ఒక్కసారిగా ఈర్ష్య తల ఎత్తింది. అతను తన నిమ్మచెట్టు చుట్టూ తవ్వి, దానికి బలమైన ఎరువు వేశాడు. కాని ఫలితం లేకపోయింది. మూడో రోజు కల్లా మొక్క నిలువునా ఎండి పోయింది.

రాముా హృదయంలో సోముా పైన ద్వేషాగ్ని ఇప్పుడు బాగా రగులుకున్నది. సోముాను సర్వనాశనం చేస్తే తప్ప అది చల్లారేటట్టు లేదు. కాని తాను స్వయంగా సోముాకు ఎలాటి అపకారమూ చెయ్యలేడు. పరోక్షంగా అతను పతనమయేటట్టు చెయ్యటానికేమన్నా మార్గం దొరుకుతుందా అని మహా ఆత్రంగా చూస్తున్నాడు రాముా.

త్వరలోనే అటువంటి అవకాశం దొరికింది. రాజుగారి కూతురికి ఏదో జబ్బు చేసింది. వ్యాధి ఫలానా అని వైద్యులు చెప్పలేక పోయారు. వారి చికిత్స లేవీ పని చెయ్యలేదు. రాముా మామగారికి దివాణంలో ఉద్యోగం. అందుచేత అతను తన మామగారి వెంట దివాణానికి వెళ్ళి, రాజుగారి దర్శనం చేసుకుని, "మహారాజా, చిన్న రాణిగారి చికిత్సకు నేనొక ఔషధం చెబుతాను, తమకు అభ్యంతరం లేకపోతే వాడి చూడవచ్చు," అన్నాడు.



రాజు ఆత్రంగా. "ఔషధమా? చెప్పు, చెప్పు," అన్నాడు.

"నా పొరుగున ఉండే సోమూ వద్ద ఒక అపూర్వమైన నిమ్మచెట్టున్నది. దాని పండ్లు చాలా పెద్దవేగాక, వాటి రసంలో రక్తధాతువున్నది. ఆ చెట్టు వేళ్ళరసం తీసి, చిన్న రాణీగారికి ఇచ్చినట్టయితే వ్యాధి నయం కావచ్చు," అన్నాడు రామూ.

"నిమ్మపండు రసంలో రక్తధాతువు ఉండట మేమిటి? కళ్ళారా చూస్తేనే గాని నమ్మను," అన్నాడు రాజు.

రామూ వెంటనే బయలుదేరి వెళ్ళి, రాజుగారికి చూపిస్తానని సోమూ నడిగి అతని నిమ్మచెట్టు నుంచి కాయ ఒకటి కోసి, తన ఇంటి నుంచి చాకు తీసుకుని రాజుగారి వద్దకు తిరిగి వచ్చి, రాజుగారికి పండు చూపాడు. దాని ప్రమాణం చూసి అందరూ ఆశ్చర్యపోయి, "నిజంగా అపూర్వమైన నిమ్మపండే!" అన్నారు.

"దాని రసం చూడండి," అంటూ రామూ తన కత్తితో ఆ నిమ్మ పండును కోశాడు. రక్తవర్ణం గల రసం పండు నుంచి వెలువడింది.

రాజుగారికి రామూ మాటలో గురికుది రింది. ఆయన వెంటనే తన భటులను పంపి, సోమూ ఆవరణలో ఉన్న నిమ్మ



చెట్టును వేళ్ళతో సహా పెకలించుకు రమ్మన్నాడు. వాళ్ళు, సోమూ ఎంత మొత్తుకున్నా వినిపించుకోకుండా, అతని నిమ్మచెట్టును వేళ్ళతో సహా తవ్వి పట్టుకుపోయారు. రాజవైద్యుడు ఆ నిమ్మ చెట్టు వేళ్ళను నూరి, రసం పిండి, రాజకుమార్తె చేత తాగించాడు.

ఈ ఔషధంతో రాజకుమార్తె జబ్బు నయమవుతుందని రామూ అనుకోలేదు. అతని కోరిక తీరి పోయింది—సోమూ నిమ్మచెట్టు నాశనమయింది. "నీ చికిత్స పని చెయ్యలేదే?" అని రాజుగారు అంటే, "అది పని చెయ్యటానికి ఒక వారం పట్టుతుంది," అని రామూ బొంకాడు. వారం గడిచింది కాని, రాజకుమార్తె వ్యాధి మరింత హెచ్చింది. రాజుగారికి ఆగ్రహం వచ్చి, రామూను ఖైదులోకి తోయించాడు.

రామూ ఇలా ఎందుకు చేశాడో సోమూ ఊహించాడు. అతడిపై సోమూకు చాలా జాలి కలిగింది.

సోమూ తండ్రికి కొన్ని చిట్కాలు తెలుసు. వాటిని ఆయన ఒక సాధువు దగ్గిర తెలుసుకున్నాడు. ఆ సాధువు ద్వారా రాజకుమార్తెకు సరి అయిన చికిత్స జరిపినట్టయితే రామూను రక్షించే అవకాశం ఉంటుంది. సోమూ ఆ సాధువును వెతు



క్కుంటూ వెళ్ళి, ఆ సాధువుకు రాజ కుమార్తె వ్యాధి లక్షణాలన్నీ వివరించి, ఔషధం పుచ్చుకుని తిరిగి వచ్చి, రాజ కుమార్తెకు దాన్ని ఇప్పించాడు. ఆమె రోగం కాస్తా తీసేసినట్టు పోయింది.

"నాయనా, నా కూతురికి ప్రాణదానం చేశావు. నీ ఋణం ఏ విధంగా తీర్చుకోను?" అన్నాడు రాజు సోమూతో.

"రామూను విడిపించండి. అతను రాజ కుమార్తెకు ఎటువంటి ద్రోహమూ తల పెట్టినవాడు కాడు. ఆ విషయం నేను తమకు ప్రమాణ పూర్తిగా చెప్పగలను," అన్నాడు సోమూ.

రాజుగారు రామూను విడిపించాడు. తనను విడిపించినవాడు, తన ఈర్ష్యవల్ల నష్టపోయిన సోమూయేనని తెలిసి, రామూ సోమూను కౌగలించుకుని ఏడ్చాడు.

"జరిగినదంతా మరిచిపో! ఏమైనా మనం స్నేహితులమే. ఒకరి కొకరు ఆ పాటి సహాయం చేసుకోవచ్చు....కాని నిమ్మ కాయలో నుంచి రక్తం తెప్పించావుట, ఎలా తెప్పించావు? ఆ రహస్యం కాస్త చెబు తావా?" అన్నాడు సోమూ.

"కత్తికి ఎర్ర జపాపుష్పాల రెక్కలు ఒకటికి పదిసార్లు రుద్ది ఉంచాను. జపా పుష్పాల రసం బాగా పట్టుకున్న కత్తితో నిమ్మకాయ కోస్తే రసం రక్తవర్ణ మవు తుంది. ఈ విద్యను నేను చాలా కాలం క్రితం ఒక గారడీ వాడి దగ్గిర నేర్చు కున్నాను. ఇటువంటి విద్యలు ఒకరి బాగు కోసం ఉపయోగించాలి గాని, ఇతరులకు హాని చెయ్యటానికి ఉపయోగిస్తే, అవి బెడిసి కొడతాయని ఇప్పుడు బాగా తెలిసి వచ్చింది," అన్నాడు రామూ.

ఆ తరవాత రామూ, సోమూ ఎప్పటి లాగే మైత్రిగా ఉంటూ, ఒకరిపై ఒకరికి ఈర్ష్య కలగకుండా చూసుకుంటూ, సుఖంగా జీవించారు.



# ఇంకా లావు కాలు

ఒక గ్రామంలో ఒక జమీందారుగారింట పెళ్ళి వచ్చింది. బస్తీ నుంచి దర్జీని పిలిపించి, పెళ్ళికి కావలసిన ఖరీదైన దుస్తులన్నీ కుట్టటానికి ఏర్పాటు చేశారు. దర్జీవాడు గుడ్డలన్నీ ముందు వేసుకుని కూర్చుని వాటిని పరిశీలించ సాగాడు. ఆ కూర్చోవటంలో వాడు ఒక కాలుమడిచి, రెండో కాలుచాచి కూర్చున్నాడు. అది బోదకాలు.

జమీందారు ఆ కాలు చూసి, "అంత లావు కాలేమిటి!" అన్నాడు ఆశ్చర్యంగా.

"అదేం చూశారు? అంతకన్నా లావు కాలున్నదీ లోగిట్లో!" అన్నాడు దర్జీవాడు.

జమీందారుగారి కాళ్ళు కూడా అంతో ఇంతో బోదకాళ్ళే. దర్జీవాడు తనను ఉద్దేశించే ఆ మాట అన్నాడనుకుని, "ఈ ఇంట్లో అంత లావుకాలు మరొకటి లేదు. నూరు రూపాయలు పందెం!" అన్నాడు.

"పందానికి ఒప్పుకున్నాను. నా రెండో కాలు చూడండి," అంటూ దర్జీవాడు, మడిచి ఉన్న తన రెండో కాలు చాపాడు. అది ఇంకా లావుగా ఉన్నది.

జమీందారుగారు మారుమాటాడ కుండా దర్జీవాడికి నూరు రూపాయలూ ఇచ్చేశాడు.





# చేపలదొంగ

ఒక బెస్తగ్రామంలో బుచ్చయ్యా, లక్ష్మి అనే దంపతు లుండేవారు. బుచ్చయ్య తెలివితేటలు లేనివాడు. అందుచేత లక్ష్మి తన తెలివితేటలతోనే సంసారం ఈదు కొచ్చేది. బుచ్చయ్య నలుగురితోనూ కలిసి సముద్రం మీదికి తెప్పల్లో వెళ్ళేవాడు. అందరూ కలిసి పట్టిన చేపల్లో అతని వంతు అతని కిచ్చేవారు. ఆ చేపలు అమ్మగా వచ్చిన డబ్బుతో లక్ష్మి ఇంటి ఖర్చులన్నీ గడిపేది.

ఒకరోజు బుచ్చయ్యకు చేపల కూర తినాలనిపించింది. ఆ రోజు తమ వంతు వచ్చిన చేపలను అమ్మటానికి అతను ఒప్పు కోక, వాటిని కూరవండమని పెళ్ళాం దగ్గిర మారాం చేశాడు.

"సరే అయితే, ఈ చేపలు పట్టుకుపోయి వాసన పోయేటట్టు కడిగి తీసుకురా," అన్నది లక్ష్మి తన మొగుడితో.

బుచ్చయ్యకు పరమానందమయింది. అతను చేపలబుట్ట పట్టుకుని చెరువు కేసి బయలుదేరాడు.

దారిలో వీరయ్య అనేవాడు ఎదురై, "ఏం, బుచ్చయ్యా? ఎక్కడిదాకా?" అని అడిగాడు.

"ఈ చేపలు చెరువులో కడిగి వాసన పోగొట్టి తెమ్మన్నది మా ఇంటిది. ఇవాళ చేపల కూర తింటాం," అన్నాడు బుచ్చయ్య.

"చేపల వాసన కడిగితే పోతుందా? వాటిని ఎండ బెట్టాలి. ఇదుగో చూడు! నా దగ్గిర నాలుగు ఎండు చేప లున్నాయి. నాకు నీ పచ్చి చేప లిచ్చి, ఈ ఎండు చేపలు పట్టుకెళ్ళి, కూర వండించుకో!" అన్నాడు వీరయ్య.

అతను తన నెత్తిమీది తట్టలో నుంచి నాలుగు ఎండు చేపలు తీసి బుచ్చయ్య

పఠాన్ ఖాదర్‌వలీ ఖాన్



కిచ్చి, అతని పచ్చి చేపలు తీసుకుని త్వర త్వరగా జారుకున్నాడు.

అసలు సంగతేమంటే, ఆ రోజే రేవులోకి వచ్చిన ఒక వర్తకపు ఓడ నుంచి వీరయ్య ఆ చేపలను దొంగిలించాడు. దొంగతనం బయటపడే పక్షంలో తన దగ్గిర ఎండు చేపలు కనిపించటం మంచిది కాదు. ఆ పరిస్థితిలో వీరయ్యకు వెర్రిబాగుల బుచ్చయ్య దొరికాడు. తాను దొంగిలించిన చేపలను అతడికి అంటగట్టాడు.

బుచ్చయ్య ఎండు చేపలను ఇంటికి తీసుకుపోయి, "ఇక కూర వండు!" అన్నాడు భార్యతో.

"పచ్చిచేప లేవీ?" అని లక్ష్మి అడిగింది. బుచ్చయ్య జరిగిన సంగతి చెప్పాడు.

తన భర్త తెలివితేటలు ఎరిగినదే గనక లక్ష్మి ఏమీ అనక, కూరకు ఒక్క చేపను తీసి ఉంచి, మిగిలినవి అమ్ముకురమ్మని బుచ్చయ్యను పంపింది. తరవాత ఆమె ఎండుచేపను తరిగేసరికి దాని పొట్టలో నుంచి ఒక వజ్రం బయటపడింది.

ఓడగల వర్తకుడు తన వద్ద ఉండే పెద్ద వజ్రాలు కొన్నింటిని దొంగల భయం కొద్దీ ఎండుచేపల్లో దాచాడు. ఓడ రేవు చేరాక కొంతసేపటికి చూసుకుంటే, వర్తకుడికి నాలుగు ఎండుచేపలు పోయినట్టు స్పష్టమయింది. వెంటనే అతను రాజుగారి దగ్గిరికి వెళ్ళి, తన ఓడలో నాలుగు చేపలు పోయాయనీ, వాటిలో తాను మణులు దాచాననీ చెప్పాడు.

వెంటనే రాజు, ఎండుచేపలు ఎవరి దగ్గిర ఉంటే వాళ్ళను పట్టుకురమ్మని, తన భటులను ఊరి మీదికి పంపాడు. వాళ్ళకు బుచ్చయ్య దొరికాడు. అతన్ని భటులు రాజు వద్దకు తీసుకుపోయారు. వర్తకుడు చేపలను గుర్తించి, "అవి నా చేపలే. కావలిస్తే వాటి పొట్టలు చీరి చూడండి, మణు లుంటాయి," అన్నాడు.

మూడు చేపలలోనూ విలువైన మణులు దొరికాయి. "ఇంకొక చేప కూడా ఉండాలి," అన్నాడు వర్తకుడు.

"ఈ చేపలను నువేనా ఈ వర్తకుడి ఓడ నుంచి దొంగతనం చేసింది ?" అని రాజు బుచ్చయ్యను అడిగాడు.

"నాకు ఓడ సంగతే తెలీదు. వీరయ్య నా దగ్గిర పచ్చిచేపలు తీసుకుని ఈ ఎండు చేపలు నాలుగిచ్చాడు. ఒకటి ఇంటి దగ్గిర కూర చెయ్యమని ఇచ్చి, వీటిని అమ్ముదామని వచ్చాను," అన్నాడు బుచ్చయ్య.

రాజు పంపిన భటులు బుచ్చయ్య ఇంటికి వెళ్ళి, లక్ష్మికి చేపపొట్టలో దొరికిన వజ్రాన్ని తెచ్చి రాజుగారి కిచ్చారు.

రాజు వీరయ్యను పట్టుకురమ్మని భటులను పంపాడు. వీరయ్య వచ్చాడు.

"ఈ ఎండుచేపలను నువేనా ఈ బుచ్చయ్య కిచ్చింది?" అని రాజు వీరయ్య నడిగాడు.

వీరయ్య కంగారుగా, "నాకు వాటి సంగతే తెలీదు, మహారాజా!" అన్నాడు.

"వీటిలో రత్నాలు దొరికాయిలే. బుచ్చయ్య నడిగితే ఈ చేపలు నువే ఇచ్చినట్టు చెప్పాడు. ఇంతకూ ఈ రత్నాలు నీవి కావన్నమాట.... చూడు, బుచ్చయ్యా, ఈ రత్నాలు నీవే! నువే ఉంచుకో!" అన్నాడు రాజుగారు.

వెంటనే వీరయ్య, "ఆగండి మహారాజా! ఆ ఎండుచేపలను నేనే బుచ్చయ్య కిచ్చాను. అందులో రత్నాలుంటే, న్యాయంగా అవి నాకే రావాలి!" అన్నాడు.

వీరయ్య దొంగ అని రుజువైపోయింది. రాజుగారు వీరయ్యకు తగిన శిక్ష విధించి, రత్నాలను వర్తకుడి కిప్పించాడు. వర్తకుడు కృతజ్ఞత కొద్దీ బుచ్చయ్యకు కొంత డబ్బిచ్చాడు. బుచ్చయ్య సంతోషంగా డబ్బుతో ఇంటికి తిరిగి వచ్చి, తృప్తిగా చేపలకూర తిన్నాడు.



# మహా బలశాలి

ఒక ఊళ్ళో ఒక బలశాలి అయిన ధనికుడుండేవాడు. అతన్ని మించిన బలశాలి ఆ వూళ్ళో లేడు. తన కన్న బలశాలి చుట్టుపక్కల ఎవడన్నా ఉన్నాడేమో తెలుసుకోవాలన్న కోరికతో అతను సంచిలో నూరురూపాయలు పోసుకుని, తన గుర్రాన్నెక్కి, గ్రామాల వెంబడి తిరుగుతూ, కనిపించినవాళ్ళను, "ఈ ఊళ్ళో మహాబలశాలి ఎవడన్నా ఉన్నాడా?" అని అడుగుతూ పోసాగాడు.

ఒక గ్రామంవాళ్ళు, "కమ్మరి బసవయ్య చాలా బలంగలవాడే!" అన్నారు. ధనికుడు గుర్రాన్ని బసవయ్య దుకాణం దగ్గిరికి నడిపించి, గుర్రం దిగకుండానే, "కమ్మరయ్యా, కాస్త చుట్టకు నిప్పియ్యి," అన్నాడు.

కమ్మరి బసవయ్య పట్కారుతో పెద్ద నిప్పుకణిక తీసి తన పట్టెడ మీద పెట్టి, కూర్చున్న చోటి నుంచి కదల కుండానే, పట్టెడను ధనికుడి చేతికి సునాయాసంగా అందించాడు. ధనికుడు పట్టెడ అందుకుని, చుట్ట అంటించి, పట్టెడను అంత సునాయాసం గానూ కమ్మరికి ఇచ్చేస్తూ, "నా గుర్రానికి లాడం ఒకటి కావాలి, చెయ్యగలవా?" అన్నాడు.

"చేసి సిద్ధంగానే ఉన్నాయి. ఇది చూడండి," అంటూ బసవయ్య ఒక లాడం ఇచ్చాడు. ధనికుడు దాన్ని పుటిక్కున విరిచి, "అబ్బే! ఇంకోటి ఇయ్యి," అన్నాడు. అతను రెండోది కూడా విరిచి, మూడోది తీసుకుంటూ, "ఇందా!" అని ఒక రూపాయి తీసి బసవయ్య కిచ్చాడు. బసవయ్య దాన్ని పుటిక్కున విరిచి, "అబ్బే! ఇంకోటి ఇయ్యి," అన్నాడు. ధనికుడు మరో రూపాయి ఇచ్చాడు. బసవయ్య దాన్ని కూడా విరిచాడు.

"నువు నిజంగా బలశాలివే. ఈ సంచీ తీసుకో!" అంటూ తన డబ్బు సంచీ బసవయ్య కిచ్చి, ధనికుడు వెళ్ళిపోయాడు.






# దురాశ

అరేబియా దేశంలోని ఒక చిన్న గ్రామంలో గుల్‌బీబీ అనే పేదరాలుండేది. ఆమె భర్త ఒంటెల పోషణ చూసేవాడు. గుల్‌బీబీ ఒక ధనికవ్యాపారి ఇంట చాకిరిచేసేది. ఆ భార్యాభర్తలు మట్టిగోడలుగల ఒక పూరికొంపలో నివసించేవాళ్ళు.

గుల్ పనిచేసే ఇంటి యజమాని అయిన వ్యాపారి పరమలోభి. అతని భార్యకూడా అలాటిదే. ఆమె తన భర్తకు తెలియకుండా ఇంటి వస్తువులు ఇరుగు పొరుగువాళ్ళకు అమ్మి, ఆ డబ్బు దాచుకునేది. గుల్‌బీబీకి నెలాఖరున జీతం ఇవ్వవచ్చేసరికి, అవీ ఇవీ పోయాయనీ, వాటిని గుల్‌బీబీయే కాజేసిందనీ చెప్పి, జీతం సగం విరగకోసేది. చేసేదిలేక గుల్‌బీబీ ఆమె ఇచ్చినంతే పుచ్చుకునేది.

ఒకనాటి రాత్రి కుంభవర్షం కురిసింది. పేద భార్యా భర్తలు తెల్లవార్లూ చలికి ముడుచుకుని తమ గుడిసెలో ఒక మూల కూర్చున్నారు. వర్షానికి గుడిసె గోడలో కొంత భాగం కూలిపోయింది. తెల్లవారగానే వాళ్ళు కూలిపోయిన మట్టి మెత్తి, మళ్ళీ గోడ నిర్మించటానికి పూనుకున్నారు. అప్పుడా మట్టిలో వారికి సీలు చేసిన వెండి చెంబు ఒకటి దొరికింది. మూత పగల గొట్టి చూస్తే చెంబు నిండా బంగారు కాసులున్నాయి. వాటితో తమ దరిద్రం తీరిపోయిందని వాళ్ళు సంతోషించారు.

గుల్‌బీబీ భర్త రెండు, మూడు బంగారు కాసులు తీసుకుని అవసరంగా కావలిసిన సరుకులు కొనుక్కు రావటానికి దుకాణానికి వెళ్ళాడు. అంత కటిక పేదవాడి దగ్గిర బంగారు కాసు లుండటం చూసి దుకాణదారు అనుమాన పడి, అది దొంగసొమ్ము కావచ్చుననుకుని, గ్రామాధికారిని పిలిపించాడు.

ఎస్. రాజారెడ్డి




ఈలోపల ఈ సంగతి గుల్‌బీబీ పని చేసే వ్యాపారి భార్యకు తెలిసింది. ఆమె తన భర్తను వెంట బెట్టుకుని గ్రామాధికారి వద్దకు వెళ్ళి, "అయ్యా, వీడి భార్య మా ఇంట్లో పని చేస్తూ ఉంటుంది. విలువ గల వస్తువులన్నీ కాజేయటం దానిఅలవాటు. అదే నా బంగారు కాసులు కాజేసింది. అవి నావే!" అన్నది.

గుల్‌బీబీ భర్త ఏమీ మాట్లాడ లేదు. తనకు దొరికిన వెండి చెంబు గురించి బయట పెడితే మిగిలిన బంగారు కాసులను గొప్ప గొప్ప వాళ్ళందరూ కలిసి పంచేసు కుంటారని వాడికి భయం వేసింది.

వాడేమీ సంజాయిషీ ఇచ్చుకోనందున గ్రామాధికారి వాడి వద్ద ఉన్న కాసులను వ్యాపారి భార్యకు ఇప్పించి, గట్టి హెచ్చరిక చేసి పంపాడు.

అంతా సవ్యంగానే జరిగిందిగాని, తనకు తెలియకుండా తన భార్య దగ్గిర బంగారు కాసులెలా చేరాయో వ్యాపారికి అర్థం కాలేదు. ఈ రహస్యం తెలుసుకోవాలని అతనికి పుట్టింది.

గుల్‌బీబీకి మాత్రం వ్యాపారి భార్య మీద భరించరానంత కోపం వచ్చింది. ఒక రాత్రల్లా నిద్రపోకుండా ఆలోచించి, ఆమె మీద పగ తీర్చుకోవటానికి ఒక ఉపాయం కనిపెట్టింది.

మర్నాడు ఆమె పని చెయ్యటానికి వ్యాపారి ఇంటికి వెళ్ళినప్పుడు, వ్యాపారి భార్య తనకు ఉతకటానికి ఇచ్చిన దుస్తులలో కొన్ని మంచివి ఏరి ఒక పక్కన పెట్టి, వాటిని తన ఇంటికి తెచ్చింది. ఆమె వాటిని ధరించి, బురఖా వేసుకుని, తమకు దొరికిన వెండి చెంబూ, బంగారు కాసులూ దుస్తులలో దాచుకుని, తన భర్తను గ్రామాధికారికి అప్పగించిన షావుకారు దగ్గిరికే వెళ్ళింది. అప్పటికి చీకటిపడి ఉండటం వల్లా, గుల్‌బీబీ ఎత్తులోనూ, లావులోనూ

వ్యాపారి భార్యను పోలి ఉండటంవల్లా, వ్యాపారి భార్య ధరించే దుస్తులే వేసుకుని ఉండటంవల్లా షావుకారు **అతితేలిగ్గా** మోసపోయాడు.

తన భర్త బంగారు కాసులను వెండి కాసులకు మార్చుకుర్మమ్మని పంపాడంటూ గుల్‌బీబీ షావుకారుకు తాను తెచ్చిన బంగారు కాసులిచ్చింది. షావుకారు బంగారు కాసులు ఎంచి చూసుకుని, గుల్‌బీబీకి ఎనిమిదివేల వెండి కాసులిచ్చాడు. గుల్‌బీబీ తన గుడిసెకు తిరిగి వచ్చేసింది. మర్నాడామె వ్యాపారి భార్య దుస్తులు తీసుకుపోయి వ్యాపారి ఇంట పెట్టేసి, వ్యాపారి భార్యతో తాను పని మానుకుంటున్నట్టు చెప్పి ఇంటికి వెళ్ళిపోయింది.

ఆరోజే షావుకారు వ్యాపారిని కలుసుకున్నప్పుడు, "బంగారానికి నేనిచ్చిన వెండి లెక్క ప్రకారం సరిపోయింది గద?" అని అడిగాడు.

వ్యాపారికి, షావుకారు మాటలేమీ అర్థం కాలేదు. "బంగారమేమిటి? వెండి ఏమిటి?" అన్నాడతను.

"నిన్న చీకటిపడేవేళ నీ భార్య చేత బంగారం పంపించి వెండి కింద మార్పించుకుంటివి కాదుటయ్యా, గుర్తులేదా?" అన్నాడు షావుకారు.

వ్యాపారికి తన భార్య మీద అదివరకే కలిగిన అనుమానం ఈసారి రూఢి అయింది. తన భార్య తనకు తెలియకుండా అంతులేని బంగారం కూడబెట్టుతున్న దన్నమాట! అతను మహాకోపంలో ఇంటికి వెళ్ళేసరికి, అతని భార్య ఏవో వస్తువులు పొరిగింటి ఆమెకు అమ్ముతున్నది. ఒళ్ళుతెలియని ఆవేశంతో వ్యాపారి తన భార్యను చావ తన్ని, పుట్టింటికి పంపేశాడు.

తమకు దొరికిన డబ్బుతో గుల్‌బీబీ, ఆమె భర్తా చీకూ చింతా లేకుండా సుఖంగా జీవించారు.



# తలతిరిగే పదవి

ఒక గ్రామంలో వెంకన్న అనే అతి బీదవాడుండేవాడు. అతను చీపుళ్ళు తయారుచేసి, వారాని కొకసారి నగరానికి వెళ్ళి, అక్కడ సంతలో అమ్మి, ఆ డబ్బుతో తననూ, తన భార్యనూ పోషించుకుంటూ ఉండేవాడు.

ఇలా కొంత కాలం జరిగాక నగరంలోని రాజాధికారి చచ్చాడు. ఆ పదవి కోసం చాలామంది పేచీలుపడి, నిర్ణయం కోసం రాజధానికి వెళ్ళి రాజుగారిని వేధించారు. వారి అంతఃకలహాలతో విసుగెత్తి రాజుగారు నగర కొత్వాలును పిలిపించి, "ఫలాని రోజు నగర ద్వారం తెరిచాక ఉదయంపూట ఎవరు నగరంలోకి అడుగుపెడితే వాణ్ణి రాజాధికారిగా నియమించు," అన్నాడు.

ఆ రోజు వెంకన్న మొట్టమొదటగా నగరంలోకి అడుగుపెట్టి నగరపాలకుడయి పోయాడు. అతనికి ఒక పెద్ద భవనమూ, నౌకర్లూ చాకర్లూ, తిరగటానికి మేనాలూ, విలువైన దుస్తులూ ఏర్పడ్డాయి. అతను వెంకటాద్రి అయాడు.

సంత నుంచి తన భర్త కోసం రోజల్లా ఎదురు చూసిన వెంకన్న భార్య తన భర్తకు గొప్ప యోగం పట్టిందని విని నగరానికి పరిగెత్తుకు వచ్చింది. ఆమెకు వెంకన్న పల్లకిలో పోతూ రాజవీధిలోనే తటస్థపడ్డాడు. ఆమె చప్పున పల్లకీని సమీపించి, "నువు మా వెంకన్నవు కాదూ?" అన్నది.

"అది నిజమేగాని, నన్ను ఎరుగుదునని మాత్రం అనకు. నే నెవరో నాకే ఇంకా తెలీకుండా ఉంది," అన్నాడు వెంకన్న.





# సేవాధర్మం

ఒక గ్రామంలో ఒక శ్రీమంతు డుండేవాడు. అయన వద్ద సేవకులుగా పనిచెయ్యటానికి అప్పుడప్పుడూ మనుషులు వస్తూ ఉండే వాళ్ళు. కాని వాళ్ళు అయనను తృప్తిపరచ లేక పోయేవారు. వాళ్ళలో సరిఅయిన సేవా తత్పరతలేదని అయనకు తోచేది. అందు చేత అయన తన సేవకులను ఎంతోకాలం ఉంచుకు నేవాడు కాడు.

ఒకసారి అయనవద్ద పనిచేస్తామని ఇద్దరు మనుషులు వచ్చారు. అయన వాళ్ళకు ఒక పరీక్ష పెట్టదలచి, చెరొక గంపా ఇచ్చి, "మీరిద్దరూ పూలతోటలో ఉండే బావికి వెళ్ళి, గంపనిండా నీళ్ళుతోడి తీసుకురండి. సాయంకాలందాకా పనిచేసినందుకు చెరొక రూపాయి ఇస్తాను," అన్నాడు.

ఇద్దరూ ఆశ్చర్యంతో ఒకరి ముఖాలు ఒకరు చూసుకుని, బావి దగ్గిరికి బయలు దేరారు. దారిలో పెద్దవాడు చిన్నవాడితో, "యజమాని బొత్తిగా మతి లేని వాడిలా కనిపిస్తున్నాడు. గంపలో నీళ్ళు నిలుస్తాయా?" అన్నాడు.

"ఆ మాట అయనకు తెలీదా ఏం?" అన్నాడు చిన్నవాడు.

ఇద్దరూ బావి దగ్గిరికి వచ్చాక చెరొక చేదా తీసుకుని, నీళ్ళుతోడి గంపల్లో పోశారు. పోసిననీరు పోసినట్టుగానే గంపల్లో నుంచి కారిపోయింది.

చిన్నవాడు ఒక్కొక్క చేదే తోడి గంపలో పోస్తూంటే పెద్దవాడుకూడా రెండు మూడు చేదలు పోశాడు. కాని ఈ అర్థంలేని శ్రమ చెయ్యటం వాడికి చిరాకువేసింది.

"గంపలో చుక్కకూడా నిలవదు. ఈ భాగ్యానికి నేను రెక్కలు విరుచుకోవ టంకూడా దేనికి? యజమాని లాగే, నీకు కూడా మతిపోతే సాయంకాలందాకా రెక్కలు హూనం చేసుకో. నా వల్లకాదు,"

డి. శ్రీరామప్ప

అంటూ పెద్దవాడు పోయి ఒక చెట్టు నీడన కూర్చున్నాడు.

చిన్నవాడు మటుకు సాయంకాలందాకా చేదతో నీళ్ళు తోడి గంపలో పోస్తూనే వచ్చాడు. సాయంకాలానికి బావిలో నీరు అడుగంటి, చేదలోకి నీళ్లతోబాటు మట్టి కూడా రాసాగింది.

సూర్యాస్తమానమయింది. చిన్నవాడు చేద కిందపెట్టి తట్ట పైకెత్తాడు. అందులో ఏదో తళతళా మెరిసింది. తీసి చూస్తే బంగారు ఉంగరం. చిన్నవాడు ఉత్సాహంతో ఆ ఉంగరాన్ని తీసుకుని యజమాని దగ్గిరికి బయలుదేరాడు. పెద్దవాడు కూడా వాడి వెంట వెళ్ళాడు.

యజమాని చిన్నవాడిచ్చిన ఉంగరం అందుకుని, "ఇది దొరుకుతుందనే మీచేత బావిలో నీళ్ళన్నీ తోడించాను. ఇదుగో నీ కూలి," అంటూ చిన్నవాడికి రూపాయి ఇచ్చి, పెద్దవాడితో, "నువు కూడా పని చెయ్యటానికే వచ్చావనుకున్నానే? రెండు బొక్కెనలు తోడి ఆపేశావేం? నీకు జీతం డబ్బుల మీద ఆశలేదా?" అన్నాడు.

"గంపలో నీళ్ళు పొయ్యమన్నారు. ఎన్ని చేదలు పోసినా గంప నిండదుగదా అని మానేశాను," అన్నాడు పెద్దవాడు పిచ్చి మొహం వేసి.

"నేను గంప నిండటానికి నీళ్ళు పొయ్యమన్నానని ఎందు కనుకున్నావు? చెప్పిన పని చేసి కూలి పుచ్చుకోవటమే నీ వంతు గాని, ఆ పని ఫలితం నాదిగద! దాన్ని గురించి ఆలోచించవలిసినవాణ్ణి నేనై ఉండగా నీకు బెంగ దేనికి? నీలో సేవా ధర్మం లేదు. నువు పనికి పనికిరావు," అని యజమాని వాడికి కాసిని డబ్బులిచ్చి పంపేసి, చిన్నవాణ్ణి పనిలో పెట్టుకున్నాడు. వాడు యజమాని మెప్పు సంపాదించేటట్టు చాలాకాలం పనిచేసి, బాగుపడి, పైకి వచ్చాడు.





# కృష్ణావతారం

ద్రౌపదీ, కృష్ణుడి భార్యలూ, ఇతర స్త్రీ జనమూ తమలో తాము కబుర్లు చెప్పుకున్నట్టుగానే పురుషులంతా ఒక చోట చేరి వారి ముచ్చట్లు వారు చెప్పుకున్నారు. ఆ సమయంలో అనేకమంది మునులు బలరామ కృష్ణులను చూడ వచ్చారు. పాండవులూ, మిగిలిన రాజులూ గౌరవపూర్వకంగా లేచి, మునులకు నమస్కారాలు చేశారు. అందరితోబాటు కృష్ణుడూ, బలరాముడూ కూడా వారిని శ్రద్ధాభక్తులతో పూజించారు.

మునులు కృష్ణుణ్ణి కీర్తించి, "నువ్వు మానవరూపం ధరించిన ఆదిదేవుడివి. మేము ఎంత తత్వవేత్తలమైనా నీ మాయకు కట్టుబడిన వాళ్ళమే," అన్నారు.

వసుదేవుడు ఆ మునుల సలహా పైన యజ్ఞాలు చేసి దేవఋణం తీర్చుకుందామని సంకల్పించాడు. యాదవులు యజ్ఞానికి అవసరమైన సంబారాలన్నీ సమకూర్చారు. వసుదేవుడూ, ఆయనకు గల పద్దెనిమిది మంది భార్యలూ స్నానాలు చేసి, కొత్త బట్టలూ, ఆభరణాలూ ధరించి యజ్ఞదీక్ష వహించారు. మునుల సహాయంతో ప్రకృతి యజ్ఞాలూ, వికృతి యజ్ఞాలూ చేసి, అన్ని యజ్ఞాలలోనూ యజ్ఞపురుషుణ్ణి ఆరాధించి, ఋత్విక్కులకు ఆవులనూ, భూమినీ, కన్యలనూ దక్షిణగా ఇచ్చి తృప్తి పరచాడు. యజ్ఞాలు పూర్తి అయిన అనంతరం అవభృత స్నానం చేసి వసుదేవుడు తన బంధుజనానికంతటికీ విందులు చేశాడు.

30. కృష్ణ నిర్యాణం





ఒకనాడు దేవకీదేవికి ఒక ఆలోచన వచ్చింది. తన కొడుకులు బలరామ కృష్ణులు సామాన్యులు కారు, శక్తి సంపన్నులు. వారు తమ గురువుకు గురుదక్షిణ కింద, చచ్చిపోయిన గురుపుత్రుణ్ణి తెచ్చి ఇచ్చారు. కంసుడు తన కొడుకులను వరసగా చంపేశాడు. అలాపోయిన తన కొడుకులందరినీ వాళ్ళు తిరిగి తీసుకువచ్చి తనకు చూపించ లేరా?

ఆమె ఈ మాటే బలరామ కృష్ణులను అడిగింది. వాళ్ళు అలాగేనని దేవకీదేవికి చెప్పి, యోగమాయ ధరించి, సుతలానికి వెళ్ళారు. అక్కడ బలిచక్రవర్తి వారికి ఘనమైన స్వాగతం తెలిపి, వారు వచ్చిన పని అడిగాడు.

"మహారాజా, పూర్వం స్వాయంభువ మన్వంతర కాలంలో మరీచి కొడుకులు ఆరుగురు, బ్రహ్మ సరస్వతిని మోహించగా చూసి నవ్వారు. అప్పుడు బ్రహ్మ వారిని రాక్షసులుగా పుట్టమని శపించాడు. స్మరుడూ, ఉద్గీథుడూ, పరిష్వంగుడూ, పతంగుడూ, క్షుద్రభువ్రూ, ఘృణీ అనే ఆ ఆరుగురూ మొదట హిరణ్యకశిపుడి కొడుకులై పుట్టి, అనంతరం మా తల్లి అయిన దేవకీదేవి గర్భాన జన్మించి, కంసుడి చేత చంపబడి, ఇప్పుడు నీ రాజ్యంలో ఉన్నారు. వారిని నా వెంట పంపినట్టయితే, మా తల్లికి చూపి, ఆమె విచారాన్ని పోగొడతాను. ఆ తరవాత వారిని ఉత్తమ లోకాలకు పంపుతాను," అని కృష్ణుడు బలితో అన్నాడు.

అందుకు బలి అంగీకరించి ఆ ఆరుగురినీ కృష్ణుడి వెంట పంపాడు. తాను పోగొట్టుకున్న ఆ కొడుకులను చూసి దేవకీదేవి ఎంతో సంతోషించింది. ఆమె వారిని కౌగలించుకుని, తన పాలు కూడా ఇచ్చింది. తరవాత ఆ ఆరుగురూ కృష్ణుడి అనుగ్రహం వల్ల ఊర్ధ్వలోకాలకు పోయారు.





కాలం గడిచిపోయింది. భారత యుద్ధంలో కౌరవ పాండవులు అపారమైన జనక్షయం కలిగించారు. యుద్ధంలో గెలిచిన ధర్మ రాజును సింహాసనం పైన కూర్చోబెట్టి కృష్ణుడు ద్వారకకు తిరిగి వచ్చాడు.

ఒకనాడు కృష్ణుణ్ణి చూడటానికి విశ్వామిత్రుడూ, అసితుడూ, కణ్వుడూ, దూర్వాసుడూ, భృగువూ, అంగిరసుడూ, కశ్యపుడూ, వామదేవుడూ, అత్రీ, వసిష్ఠుడూ, నారదుడూ మొదలైన మునులు వచ్చినప్పుడు కొందరు యాదవకుమారులు సాంబుడికి గర్భిణీ స్త్రీ వేషం వేసి వారి దగ్గిరికి తెచ్చి, ఎంతో వినయం నటిస్తూ, "ఈమె తన కే బిడ్డ కలిగేదీ మిమ్మల్ని అడగటానికి సిగ్గు పడుతున్నది. అందుచేత మేమే అడుగుతున్నాం. తమకు తెలియునిదంటూ లేదు గనక దయచేసి చెబుతారా?" అని మునులను అడిగారు.

మునులకు చాలా కోపం వచ్చింది. "మూఢులారా, దీని కడుపున కులనాశన కరమైన ముసలం పుడుతుంది!" అని వారు శపించారు.

యాదవకుమారులు భయపడి పారిపోయి, సాంబుడి బట్టలు విప్పి చూస్తే, అతని పొట్ట నుంచి ఒక ఇనపరోకలి బయ







టికి వస్తూ కనపడింది. వాళ్ళు దాన్ని బయటికి తీసి, "ఎంత పాపిష్ఠి పని చేశాం! ఈ సంగతి తెలిస్తే యాదవులందరూ ఏమంటారో?" అని భయపడుతూ ఉగ్రసేనుడి వద్దకు పోయి, జరిగినదంతా ఆయనకు చెప్పారు.

ముసలం గురించీ, మునుల శాపం గురించీ యాదవుల కందరికీ తెలిసింది. వాళ్ళు ఆశ్చర్యపోయారు, భయపడ్డారు కూడా. ఉగ్రసేనుడు యాదవులతో, ఆ ముసలాన్ని అరగదీసి, దాని పొడిని సముద్రంలో కలపమన్నాడు. యాదవులు అలాగే చేశారు. ఆ పొడి సముద్రపు అలల తాకిడికి ఒడ్డుకు కొట్టుకు వచ్చి, అక్కడ తుంగ రూపంలో మొలిచింది. ముసలాన్ని అరగదీయగా చివరకు మిగిలిన సన్నని ముక్కను ఒక చేప మింగింది. ఆ చేప ఒక జాలరి వాడికి మరికొన్ని చేపలతో సహా దొరికింది. ఆ జాలరి ఆ చేప కడుపులో కనిపించిన ఇనప ముక్కను తీసుకుని, ఒక బాణానికి ములికిగా ఉపయోగించు కోవటానికి ఒక వేటగాడికి ఇచ్చాడు.

ఈ విధంగా యాదవ వినాశనానికి తగిన ఏర్పాట్లు పూర్తి అయాయి.

తరవాత కొంత కాలానికి ద్వారకలో ఉత్పాతాలు కనిపించాయి. అప్పుడు కృష్ణుడు సుధర్మ సభాభవనంలో యాదవులందరినీ సమావేశపరచి, వారితో ఇలా అన్నాడు:

"అయ్యో, ద్వారకలో మహా దారుణమైన ఉత్పాతాలు కానవస్తున్నాయి. ఇవి కీడును సూచిస్తున్నాయి. మునులు యాదవ వంశాన్ని శపించిన సంగతి మీకు తెలిసినదే. అందుచేత మనం ఒక్క క్షణం కూడా ఈ ద్వారకలో ఉండటం మంచిది కాదు. స్త్రీలనూ, పిల్లలనూ, వృద్ధులనూ శంఖద్వారానికి పంపేద్దాం. మిగిలిన వాళ్ళమందరమూ సరస్వతీ నదీ తీరాన గల





ప్రభాసతీర్థానికి వెళ్ళి, అక్కడ స్నానాలూ, ఉపవాసాలూ చేసి, దేవపూజ చేసి, బ్రాహ్మణులకు గోవులనూ, బంగారాన్నీ, వస్త్రాలనూ, ఏనుగులనూ, గుర్రాలనూ, గృహాలనూ దానం చేద్దాం. వారి చేత శాంతికర్మలు చేయింతాం. దేవతలనూ, బ్రాహ్మణులనూ, గోవులనూ పూజిస్తే అన్ని అరిష్టాలూ తొలగిపోగలవు. మనకు శుభం కలుగుతుంది."

యాదవ ముఖ్యులందరూ కృష్ణుడు చెప్పిన దాన్ని ఆమోదించారు. స్త్రీలనూ, పిల్లలనూ, వృద్ధులనూ పంపేసి, యాదవులందరూ ఓడల మీద సముద్రాన్ని దాటి ప్రభాసతీర్థాన్ని చేరుకున్నారు. కాని అక్కడ వారిని దైవమాయ ఆవరించింది. అందరూ కల్లుతాగి, ఆ మైకంలో కొట్లాటలకు దిగారు. అది తీవ్రమైన యుద్ధంగా పరిణమించింది. ఆ యుద్ధంలో ఏనుగులూ, గుర్రాలూ చచ్చాయి. రథాలు విరిగాయి. ప్రముఖ యాదవుల మధ్య ద్వంద్వ యుద్ధాలు సాగాయి. ప్రద్యుమ్నుడూ, సాంబుడూ పోరాడారు. అలాగే అక్రూరుడు భోజుడితోనూ, అనిరుద్ధుడు సాత్యకితోనూ, సుభద్రుడు సంగ్రామజితుతోనూ, సుచారుడు గదుడితోనూ, సుమిత్రుడు సురథుడితోనూ యుద్ధాలు సాగించారు. ఇదే విధంగా



మిగతావారంతా కొట్లాటలకు తలపడ్డారు. బంధుభావమూ, మిత్రభావమూ లేకుండా పోయాయి. వెర్రెత్తిన వారిలాగా ఒకరినొకరు చంపుకోసాగారు.

కొంతసేపటికి బాణాలన్నీ అయిపోయాయి. విల్లులన్నీ విరిగిపోయాయి. మరి ఆయుధాలు లేవు. సముద్ర తీరాన ఏపుగా పెరిగిన తుంగ ఉన్నది. దాన్ని పీకి, దానితో ఒకరినొకరు చంపుకోసాగారు. కృష్ణుడు వారిని ఆపాలని చూశాడు. వాళ్ళు అలిగి, బలరాముడి మీదా, కృష్ణుడి మీదా కలియబడ్డారు. కృష్ణుడికి మండిపోయింది. అతనే ఆ తుంగ పీకి, దానితో యాదవులను





ఎడాపెడా చంపేశాడు. మునుల శాపం, కార్చిచ్చు వెదుళ్ళను కాల్చినట్టుగా, యాదవవంశాన్ని నిర్మూలించింది.

అందరూ చచ్చారు. కృష్ణుడు అంతటా కలయ జూసి, "భూభారం తగ్గిపోయింది," అనుకున్నాడు.

బలరాముడు సముద్ర తీరాన యోగ సమాధిలో కూర్చుని ప్రాణాలు వదిలాడు. అది కళ్ళారా చూసి కృష్ణుడు ఒక రావి చెట్టు మొదట్లో, కుడి తొడమీద ఎడమ పాదం పెట్టి కూర్చున్నాడు. ఎర్రని ఆ ఎడమ పాదాన్ని చూసి, అదేదో జంతువు ముఖమనుకుని, జరుడనే వేటగాడు దాన్ని



బాణంతో కొట్టాడు. ఆ బాణం ములికి ముసలాన్ని యాదవులు అరగదీయగా మిగిలినదే!

బాణం వేసి పరిగెత్తుకుంటూ వచ్చిన ఆ వేటగాడు, తాను మృగమనుకున్నది మనిషి పాదమని తెలుసుకుని, కృష్ణుడితో, "అయ్యో, పొరపాటు జరిగిపోయింది, నన్ను క్షమించు," అన్నాడు.

కృష్ణుడు జరుడితో, "విచారించకు. నేను కోరుకున్నదే జరిగింది," అని వాణ్ణి పంపేశాడు.

ఈలోపల దారుకుడు రథంలో, కృష్ణుణ్ణి వెతుక్కుంటూ అటు వచ్చి, కృష్ణుణ్ణి చూసి, రథం దిగి దగ్గిరికి వచ్చాడు. కృష్ణుడు దారుకుడితో, "నువు ద్వారకకు వెళ్ళి, మనవాళ్ళతో అందరూ చచ్చారనీ, బలరాముడు పోయాడనీ, నేను ఈ స్థితిలో ఉన్నాననీ చెప్పు. మీరెవరూ ఇంక ద్వారకలో ఉండకండి. నేను పోయాక సముద్రుడు దాన్ని ముంచేస్తాడు. నా తల్లి దండ్రులూ, మిగిలినవాళ్ళూ ఇంద్రప్రస్థానికి వెళ్ళి, అర్జునుడి అండన ఉంటారు. నువు జరిగిన దాన్ని గురించి నిర్లిప్తంగా, జ్ఞాననిష్ఠలో బతుకు," అని చెప్పాడు.

దారుకుడు కృష్ణుడికి ప్రదక్షిణం చేసి, చిన్నబోయిన మనసుతో ద్వారకకు వెళ్ళి



పోయాడు. అక్కడికి చేరి అతను ఏడుస్తూ ఉగ్రసేనుడి కాళ్ళమీదా, వసుదేవుడి కాళ్ళ మీదా పడి, యాదవులంతా చచ్చిపోయిన సంగతి తెలియజేశాడు. అందరూ గుండెలు బాదుకుంటూ యాదవులు చచ్చిన చోటికి వెళ్ళారు. వసుదేవుడూ, దేవకీ, రోహిణీ తమ కొడుకులైన బలరామ కృష్ణుల కోసం ఎంతో వెతికారు. కాని వాళ్ళ శరీరాలు కనిపించ లేదు. ఆ ముగ్గురూ గుండెలు పగిలి అక్కడే ప్రాణాలు విడిచారు.

యాదవుల భార్యలందరూ తమతమ భర్తలతో సహగమనం చేశారు. బలరాముడి భార్యలు కూడా బలరాముడి చితి మీదనే కాలిపోయారు. వసుదేవుడి భార్యలూ, కృష్ణుడి భార్యలూ కూడా అలాగే చేశారు.

అర్జునుడు వచ్చి, చచ్చిపోయిన బంధు గణానికి ఉత్తరక్రియలు చేయించాడు. అదే సమయంలో ద్వారకానగరం సముద్రంలో మునిగిపోయింది. నగరంలో ఉన్న దేవాలయం ఒక్కటి మాత్రం నీటి మీద కనబడుతూ నిలిచింది.

అర్జునుడు, చావగా మిగిలిన స్త్రీలనూ, బాలలనూ, వృద్ధులనూ వెంట బెట్టుకుని ఇంద్రప్రస్థానికి వచ్చి, వజ్రుడికి పట్టాభిషేకం చేశాడు. అటు తరవాత పాండవులు ద్రౌపదితో సహా మహాప్రస్థానం వెళ్ళారు.

కృష్ణుడు నిర్యాణం చెందే సమయంలో అక్కడికి బ్రహ్మ, ఇంద్రుడూ, తదితర దేవతలూ, ప్రజాపతులూ, సిద్ధులూ, విద్యాధరులూ, అప్సరలూ వచ్చారు. ఆకాశమంతా వారి విమానాలతో నిండి పోయింది. విమానాల నుంచి పుష్పవర్షం కురిసింది. కృష్ణుడు దివ్యమైన విష్ణువు రూపం ధరించి, తనను చూడవచ్చిన వారి నందరినీ ఒకసారి చూసి, సత్యమూ, ధర్మమూ, ధృతీ, శ్రీ, కీర్తి తనవెంట రాగా, వైకుంఠానికి బయలుదేరాడు.

—(అయిపోయింది)





# అరణ్యపురాణం

## 33

మౌగ్లీ ఆ నాడు మిగిలిన రాత్రీ, మర్నాడు పగలూ నిద్రపోయి, చీకటి పడే వేళకు లేచాడు. నిద్ర మేలుకుంటూనే అతను కత్తిమీదికి చెయ్యి పోనిచ్చి, చివాలున లేచి నిలబడి, యుద్ధానికి సిద్ధమయాడు. మెస్సువా అతన్ని చూసి నవ్వుతూ భోజనం తెచ్చి పెట్టింది.

అతనిలో చెలరేగే ఆందోళన అలాగే ఉన్నది. అతనికి పరిగెత్తాలని కూడా ఉన్నది. కాని పసిపిల్లవాడు మౌగ్లీ ఒళ్ళో నుంచి దిగలేదు. మౌగ్లీ జుట్టు దువ్వుతానని మెస్సువా కూడా పట్టుపట్టింది. ఆమె పిచ్చి పాటలేవో పాడుతూ, మౌగ్లీ జుట్టు చిక్కు తీస్తూండగా, బయటినుంచి పెద్దన్న మూలగటం వినిపించింది.

మౌగ్లీ జంతువుల భాషలో, "రమ్మన్నప్పుడు వచ్చావు కావు," అన్నాడు.

"నీ మిత్రులందరినీ చేర్చకు, పుణ్యం ఉంటుంది," అన్నది మెస్సువా మౌగ్లీతో.

"నీ కేమీ భయం లేదు. ఆ నాడు మీరు కాన్హివారాకు వెళ్ళేటప్పుడు మీకు తెలీకుండా నా మిత్రులు ఎందరో మిమ్మల్ని అనుసరించి కాపాడారు. అమ్మా, నేనిక వెళ్ళాలి!" అన్నాడు మౌగ్లీ.

మౌగ్లీ తలుపు మీద చెయ్యి వేసి తెరవబోతూండగా మెస్సువా అతని మెడ చుట్టూ చేతులు వేసి, "మళ్ళీ రా, నాయనా! కొడుకువో, కావో, నువ్వంటే నాకు ప్రాణం. చూడు, వాడు కూడా ఏడుపు మొహం పెట్టాడు," అంటూ పసివాణ్ణి చూపింది. మౌగ్లీకి గొంతులో ఏదో అడ్డం పడ్డట్టనిపించింది; "తప్పక వస్తాను," అన్నాడు.

అతను బయటికి వచ్చి పెద్దన్నతో, "మీరు నలుగురూ నేను పిలిచినప్పు డెందుకు

అట్ట చివరి బొమ్మ



రాలేదు? ఇంతకాలం ఏం చేస్తున్నారు?" అని అడిగాడు.

"ఎంతకాలం? నిన్న రాత్రేగా? కొత్త పాటలు పాడాం," అన్నాడు పెద్దన్న.

"అవునవును," అన్నాడు మౌగ్లీ.

"నువు చేసిన పనేమిటి? మనిషి మందలో కలిసి తిని, నిద్రపోయావా?" అని పెద్దన్న అడిగాడు.

మౌగ్లీ ఏదో అనబోతూండగా తెల్లదుస్తులు వేసుకుని ఒక అమ్మాయి దారి వెంబడి పోతూ కనబడింది. పెద్దన్న వెంటనే దాక్కున్నాడు. మౌగ్లీ పొలంలో ఎత్తుగా పెరిగిన మొక్కల మధ్యకు వెళ్ళాడు.

ఏదో దయ్యాన్ని చూశాననుకుని ఆ యువతి కెవ్వున అరిచింది. తరవాత ఒక్క నిట్టూర్పుతో తనను తాను సంబాళించుకుని ముందుకు పోయింది. మౌగ్లీ పైరు మొక్కల మధ్య నుంచి ముఖం బయటికి పెట్టి ఆమె కనబడకుండా పోయిన దాకా చూశాడు. తరవాత పెద్దన్న కేసి తిరిగి, "నేను మనిషి మందకుపోతే నా వెంట మీరు రారా?" అని అడిగాడు.

"అదివరకు వచ్చాం కామా? ఇప్పుడు రాలేదా?" అన్నాడు పెద్దన్న.

"ఎన్ని సార్లయినా వస్తారా?" అని మౌగ్లీ అడిగాడు.

పెద్దన్న కాస్సేపు మౌనంగా ఉండి, "బాఘీర అన్నది నిజం. మనిషి చివరకు మనిషినే చేరుకుంటాడు. అమ్మ కూడా అనేది—" అన్నాడు.

"అకేలా కూడా అదే అన్నాడు," అన్నాడు మౌగ్లీ, గొణుక్కుంటూ.

"మహాజ్ఞాని కావా కూడా అలాగే చెప్పాడు," అన్నాడు పెద్దన్న.

"నువ్వేమంటావు పెద్దన్నా?" అని మౌగ్లీ అడిగాడు.

"వాళ్లు నిన్ను ఒకసారి వెళ్ళగొట్టారు. నీ మూతి మీద రాయి విసిరారు. నిన్ను

చంపటానికి బలదేవుణ్ణి పంపారు. నిన్ను ఎర్రపువ్వులోకి తొయ్యాలని చూశారు. వాళ్ళను నువే నా నా తిట్లూ తిట్టావు. వాళ్ల మీదికి అరణ్యాన్ని పంపకం చేశావు," అన్నాడు పెద్దన్న.

"ఇంతకూ నీ ఉద్దేశం చెప్పలేదు," అన్నాడు మౌగ్లీ. ఈ సంభాషణ చేస్తూ ఇద్దరూ పరిగెత్తుతున్నారు.

"మా నలుగురమూ నీ వాళ్ళమే. నీ దారే మా దారి. ఒక తల్లిబిడ్డలం. అరణ్యాని కేం చెప్పుకుంటావు?" అన్నాడు పెద్దన్న.

"బాగా జ్ఞాపకం చేశావు. నువు ముందు వెళ్ళి కొండ మీద అందరినీ సమావేశ పరుచు. నా కడుపులో మాట వాళ్ళకు చెప్పుకుంటాను," అన్నాడు మౌగ్లీ.

మరొక తరుణంలో అయితే అందరినీ ఒక్క కేకతో సమావేశపరిచే పనే. కాని కొత్త పాటల తరుణం ఇంకా పూర్తి కాలేదు.

"అరణ్యాధిపతి మనుషుల మధ్యకు పోతున్నాడు. కొండ మీదికి రండి!" అని పెద్దన్న కేకలు పెట్టాడు.

"ఎండలు ముదిరాక తిరిగి వస్తాడులే!" అన్నారు కొందరు నిర్లక్ష్యంగా.

మౌగ్లీ కాళ్ళీడ్చుకుంటూ సమావేశ స్థలానికి చేరేసరికి అక్కడ అన్నలు నలుగురే



ఉన్నారు. వాళ్ళు కాక కళ్ళు బొత్తిగా కనబడని భాలూ, కావా కూడా ఉన్నారు.

"నీ శకం ముగిసిందా, మనిషికూనా? కాసిని కన్నీళ్ళు వదిలెయ్యి," అన్నాడు కావా.

మౌగ్లీ బాధతో మూలుగుతూ, "ఆ శునకుల చేతిలోనైనా పోయాను కాను. నా బలమంతా పోయింది. పడుకుంటే నిద్రరాదు. స్నానం చేస్తే తాపం పోదు. నా ఎముకలన్నీ గుజ్జులా గయాయి," అన్నాడు.

"ఎందు కిన్ని మాటలు? ఆ నాడు అకేలా కూడా అన్నాడు — మౌగ్లీని మనిషి మందకు తిరిగి వెళ్ళమని. నేనూ అన్నాను. ఈ ముసలాడి మాట ఎవరు వింటారు?

బాఘీరా కూడా—ఏడీ, బాఘీర ఎక్కడ?" అన్నాడు భాలూ.

"నాకు ఏనాడో తెలుసు, అరణ్యం వద్దన్నా మనిషి మనిషిమందకే పోతాడు చివరకు," అన్నాడు కావా.

అన్నలు నలుగురూ బిత్తరపోయి ఒకరి నొకరు చూసుకుని, మౌగ్లీ కేసి చూశారు.

భాలూ మౌగ్లీతో, "నాకు కళ్ళు కనపడక పోయినా, బుద్ధికి అంతా కనపడుతుంది. కప్పాయ్, నీ దారి నువు చూసుకో. మనిషి మందలో చోటు చేసుకో. కాని అరణ్యం నువు ఎప్పుడు పిలిచినా పలుకుతుంది, నీ చెప్పుచేతల్లో ఉంటుంది," అన్నాడు.

"నాకు పోవాలని లేదు. నన్ను కాళ్ళు ఈడ్చుకుపోతున్నాయి," అన్నాడు మౌగ్లీ.

"పట్టులో తేనె అయిపోయింది. విడిచి పోక తప్పదు," అన్నాడు భాలూ.

"ఒకసారి విడిచిన కుబుసంలోకి మళ్ళీ ప్రవేశించేది లేదు," అన్నాడు కావా.

"కాని బాఘీర మాటేమిటి? నన్ను ఎద్దు నిచ్చి కొన్నాడు—"

మౌగ్లీ మాట పూర్తి కాకముందే పొద లను తోసుకుంటూ బాఘీర వచ్చాడు. అతను రక్తసిక్తమైన పంజా ఎత్తి చూపుతూ, "ఇందుకే నేను రావటం ఆలస్యమయింది. రెండేళ్ళ వయసు గల ఎద్దును చంపాను. నిన్ను అదే విడుదల చేస్తుంది, తమ్ముడూ. అన్ని రుణాలూ తీరిపోయాయి. వేట సాగాలి, తమ్ముడూ! భాలూ అభిప్రాయమే నాదీనీ!" అన్నాడు.

భాలూ మౌగ్లీని గట్టిగా కౌగలించు కున్నాడు. భాలూ భుజం మీద తల పెట్టి మౌగ్లీ ఏడుస్తుంటే, "కుబుసం విడవట మంటే ఎంత కష్టం!" అన్నాడు కావా.

పెద్దన్న తల ఎత్తి చూసి, "నక్షత్రాలు పలచబడుతున్నాయి. ఇక మన దారి మనం వెతుక్కోవాలి!" అన్నాడు మిగిలిన తోడేలు తమ్ముళ్ళతో. —(అయిపోయింది)



# 87. ప్రాచీన పనామానగర అవశేషం

ప్రాచీన పనామానగరం 1519 లో నిర్మించబడింది. దాదాపు 300 ఏళ్ళ క్రితం ఈ స్పానిష్‌నగరం కొల్లగొట్టబడి నిర్మూలించబడింది. సేంట్ అనాస్టియస్ కెథీడ్రల్ తాలూకు రాతిగోడలు మాత్రమే ఈనాడు నిలిచి ఉన్నాయి. నూతన పనామానగరాన్ని, ఈ అవశేషాలకు ఆరుమైళ్ళ పడమట నిర్మించారు.



Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

నిరుపేదల జీవితాలు

పంపినవారు:
డి. జి. ఆచారి, విశాఖ

Photo by K. S. Vijayaker



బహుమతి
పొందిన వ్యాఖ్య

అవరోహణ సోపానాలు

పంపినవారు :
డి. జి. ఆచారి, విశాఖ

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1969 ఏప్రిల్ నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఫిబ్రవరి నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 20/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: నిరుపేదల జీవితాలు

రెండవ ఫోటో: అవరోహణ సోపానాలు

పంపినవారు: దార్ల గున్నయాచారి,

కంచెర స్ట్రీట్, విశాఖపట్నం—1.

బహుమతి మొత్తం రు. 20/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# ఫోస్ఫోమిన్





శక్తిని పెంపొందించును.

ఆకలిని అధికము చేయును.



సహనశక్తిని హెచ్చించును.

శరీరముయొక్క

రోగనిరోధక శక్తిని ఎక్కువ చేయును.

అవును —

కుటుంబము అంతటికి ఫోస్ఫోమిన్
వల్ల ఆరోగ్యము కలుగును.

ఫోస్ఫోమిన్...బి కాంప్లెక్స్ విటమినులు మల్టిపల్
గ్లిసరోఫోస్ఫేట్లుగల ఆకుపచ్చని పండ్ల రుచిగల టానిక్




® ఇ. ఆర్. స్క్విబ్ & సన్స్ ఇన్‌కార్పొరేటెడ్ వారి
రిజిష్టర్డ్ ట్రేడ్‌మార్కుకు చిహ్నం: దీని లైసెన్సు
ఉపయోగదారులు కరంచంద్ ప్రేంచంద్ ప్రయివేట్ లిమిటెడ్

SQUIBB®

SARABHAI CHEMICALS

Shilpi SC 50 A /67 Tel

# మీ ఉత్తరాలు త్వరగా పోస్టు చేయండి

తపాలా కార్యాలయాలలో పని ముగిసే సమయానికి ఎక్కువ ఉత్తరాలు పోస్టు చేయబడుతాయి. ఒక్కసారిగా వొత్తిడి రావటంతో జరిగే పని ఆలస్యమవుతుంద.

త్వరగా పోస్టు చేశారంటే ఈనాటి టపాలోనే మీ ఉత్తరం రవాణా చేయబడు తుంది. దాని గమ్యం పకాలానికి చేరుతుంది. ఏ మాత్రం ఆలస్యం వుండదు.

*ఇప్పుడే పోస్టు చెయ్యండి. సాయంత్రంవరకు వేచి వుండట మెందుకు?*



భారత తంతి తపాలా శాఖ

davp. 68/484

తప్పక చూడండి!

GOTETI

మద్రాసు సినీ
లేబరేటరీ
సమర్పించు

సత్యా మూవీస్

# డ్రైవర్ మోహన్

దర్శకత్వం: పి.నీలకంఠన్
మాటలు - పాటలు: అనిసెట్టి
సంగీతం: యం.ఎస్.విశ్వనాథం-పామర్తి

ఆంధ్ర: గౌతమి రిలీజ్.
సీడెడ్: జయలక్ష్మి
నైజాం: శ్రీ నేషనల్ ఆర్ట్సు పిక్చర్సు

STUDIO Ketan

